


జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# మహిళామహాసభ - నిర్వాహకులకు హెచ్చరిక

అఖిలభారత మహిళామహాసభ ఈనెల 29-వ తేదీనుండి కాకినాడ నగరమున సమావేశము కానున్నది.

మొట్టమొదటిసారిగా ఆంధ్రదేశమున జరుగనున్న యీ యావద్భారత స్త్రీ సమ్మేళనము అత్యంత జయప్రదముగా జరుగుగాక యని కోరెదము.

ఈ సందర్భమున ఆంధ్రదేశమున వివిధజిల్లాలలోను జరిగియుండిన మహిళాసభల చర్చలు, చర్యలు, తీర్మానములు, ఉపన్యాసములును వార్తాపత్రికలద్వారా చదువరులెల్లరకు విశదమయియే ఉండును.

ప్రత్యేకముగ స్త్రీజనాభ్యుదయమునకే, నారీలోక సౌభాగ్యమునకే ప్రారంభింపబడి నిర్వహింపబడుచున్న "గృహలక్ష్మి" ఈ యవసరమున స్త్రీల సమస్యలగూర్చిన సింహావలోకనము చేయవలసిన విధి యున్నది.

ఏ ఉద్యమమునయినను మూలసూత్రములను, ప్రధాన సిద్ధాంతములను ఎల్లప్పుడును ఏమరక జాగ్రత్తతో నడిపింపవలసియుండును.

వనితాలోకమునకూడ నంతియే. భారతీయ నారీమణులకు, ఆంధ్రస్త్రీలకు ప్రత్యేకముగా ప్రత్యక్షముగా సంబంధించిన సమస్యలపైననే ముఖ్యముగా దృష్టిని కేంద్రీకరించవలెను. దేశీయ తత్త్వమునకు, జాతీయ

విధానమునకును, మన సంస్కృతి విజ్ఞానములకును విరోధముగగాని విలక్షణముగగాని యుండరాదు మన సంస్కరణశీలముగాని పురోవృద్ధిమార్గములుగాని.

భారతదేశము అనగానే, ప్రధానముగా జ్ఞప్తియందుంచుకొనవలసినది పల్లెగ్రామములలోనే విశేషముగా నివసించు జనమేగాని కొన్ని ముఖ్యపట్టణములలో నివసించు కొద్దిమంది "నాగరికులే" కారు.

దేశీయ-జాతీయ జీవనములో, దైనిక సాంసారిక-సాంఘిక జీవనములో, నిత్యనైమిత్తిక కార్యకలాపములలో, అత్యంతాధికసంఖ్యాకులగు సామాన్య స్త్రీజనమునకు సంబంధించిన కష్టనష్టములు, సాధకబాధకములు, నిజము నిస్సారములు, అర్హతలు, బాధ్యతలు, హక్కులు, అవసరములు, న్యాయాన్యాయములు, విధులు ధర్మములు, కర్తవ్యములు సాంగోపాంగముగా తర్జనభర్జన చేసి, వివిధదృక్పథములనుండి చర్చచేసి, భారతీయ సంప్రదాయమునకును సభ్యతకును కొఱతరాని విధముగ స్త్రీజనుల ఆత్మాభివృద్ధికి, ఆత్మవికాసమునకు, ఆత్మ స్వాతంత్ర్యమునకు, దాస్యభావమునుండి తొలగి స్వయమాధారబుద్ధి నలవడజేసికొనుటకు తగుమైన వివిధమార్గములను సాధనోపాయములను తేల్చి తీర్మానించవలసిన మహత్తర కర్తవ్యము ఈ మహిళా మహాసభా నిర్వాహకులమీద నున్నది.

పురుషుల సభలకు అనుకరణములుగను, రాజకీయ తీర్మానముల తీరునను, ఒకరిని చూచి ఇంకొకరును, ఒకసభ మాదిరియే మరొకసభయు, జరిపించి పత్రికలలో ప్రకటనలు జరుగుటతో సంతృప్తినొందుట కాదు కావలసినది.

ఫలోన్ముఖమునకు రాజాలనివి, కార్యరూపమున ఆచరణలోనికి రానివి, సాధ్యముకానివి, ఆడంబరముతో కూడుకున్నట్టివి యైన తీర్మానములు "ఏకగ్రీవముగ" నైనను గావించుట ఒక ప్రయోజనము కాజాలదు.

అఖిలభారత మహిళా మహాసభా సంస్థగాని, తదంగమగు రాష్ట్రీయ మహిళాసభా శాఖగాని, ఒకయేటి కింకొక యేడాదికి ప్రత్యక్షముగ కార్యరూపముగ నిర్వహింపజేయగల కార్యక్రమము ఏదైన యుండుట అత్యంతావశ్యకము.

నేటిసభ ఆంధ్రదేశమున జరుగుచుండు సందర్భమున, ఆంధ్రదేశములోని స్త్రీ జనము అభివృద్ధికి నిక్కువముగ తోడ్పడగల కార్యవిధానమును సూచించు తీర్మానములు చేయుట ఎక్కువ యవసరము ఉపయోగకరము నగును.

ఇంతకుపూర్వము ప్రతి సంవత్సరము అఖిలభారత జాతీయ మహాసభ (కాంగ్రెసు) సమావేశములతోపాటు జరుగుతూ వచ్చిన సంఘసంస్కరణ సమావేశముల నకళ్లుగ, యిపుడు ప్రత్యేక వార్షిక స్త్రీ సమావేశములు చేసి, కొన్ని గంభీరోపన్యాసములు, కొన్ని పెద్దపెద్ద తీర్మానములు చేసివేసినంతనే సంతోషింపదగిన యంశమేమీ కాదు.

ప్రముఖముగ ప్రకృతిసిద్ధముగ గృహిణులుగను, మాతలుగను, దేశము గర్వింపగల యోగ్యసంతతికి జన్మదాతలుగను ఉండవలసిన స్త్రీలు తమ జీవితపరమార్థమును సాఫల్యతను Vocation ను మరువక, నిత్యము

ఎదుర్కొనవలసిన సమస్యలనే మనస్సులందుంచుకొని అచ్చముగ కార్యరూపేణ ఆచరణయోగ్యమగు సూచనలతో కూడిన తీర్మానములనే చేయుదురుగాక యని కోరెదము.

దైవసృష్టియందే, ప్రకృతిసిద్ధముగ, స్త్రీ - పురుషుల నిర్మితియందు కొంత వ్యత్యాసము, నైజగుణ సామర్థ్యములందు కొంత అంతరము ఉన్నవి కదా!

సమానత్వ దృష్టి, సమాదరణ హక్కులు అవసరమే యయినను, స్వభావముల ననుసరించి ప్రపంచ కార్యరంగములందు స్త్రీ పురుషులకు భిన్నభిన్న అభిరుచులు సౌకర్య కౌశలములు నున్నవిగదా!

వైమానికులుగను, సైనికులుగను, నావికులుగను, రక్షకభటులుగను, యంత్రనిర్మాతలుగను, ఇంజనీరులుగను మన స్త్రీలు పురుషులతో సమానముగ ఉద్యోగములు కోరుకొనుట సహజముగను సమర్థముగను ఉండునా?

వైద్యము, విద్యాబోధనము, నర్సింగు (దాది వృత్తి) మంత్రసానితనము, కుట్టుపని మొదలగు కొన్ని చేతిపనులు, లలితకళలు, నాజూకు పరిశ్రమలు ఆదిగాగల శాఖలందును స్త్రీలు యోగ్యముగ ఉద్యోగములను జీవనోపాయములను నిరభ్యంతరముగ కోరి సంపాదించి ఆర్థిక స్వాతంత్ర్యమును స్వాధీనతను తప్పక బడయవచ్చును.

సంఘసేవా కార్యములందును ప్రజోపయోగ సంస్థల కృషికలాపములందును గృహిణులు పురుషుల కంటెను నేర్పుతో యథోచితముగ పాల్గొని దేశసౌభాగ్యము చేకూర్పగలరు.

ఈ పై సూచనల కనుగుణ్యమైన కార్యక్రమమును విధానమును నిర్ణయించు తీర్మానములు అవసరములు.

స్త్రీలకు పురుషులతో సమానమగు ఆస్తిహక్కులు వారసత్వము కావలయుననుట నిర్వివాదాంశము. ఇందుగూర్చి ఆందోళన చేయవలసినదే.

స్త్రీ పురుషులలో హెచ్చుతక్కువ భావములు లేక సమాన గౌరవ ఆదరణలు సంఘములో లభ్యము కావలెనని హృదయపూర్వకముగా మేము కోరెదము. కాని హక్కులకంటెను, బాధ్యతలు ముఖ్యములనియు, అంతకంటె అర్హతలు మరీ ముఖ్యమని, జన్మ-జాతికంటె గుణశీలములు యోగ్యతలు పరమప్రధానములని మేము గుర్తింతుము. యోగ్యతనుబట్టియే ఫలము ఫలితములు. పురుషులతో స్పర్థపోటీ కంటెను, స్త్రీలలో ఉత్తమ అర్హ స్వభావ వర్తనములకు తగు ప్రోత్సాహము సంవిధానమునే ఇతోధికముగ మహిళా ఉద్యమమున ప్రయోజనకారియై దేశసౌభాగ్యమునకు స్వరాజ్యప్రతిష్ఠకు దోహదము కాగలదని మా నమ్మకము.

అభివృద్ధినిరోధకముగా ఉండకూడదుగాని విప్లవకరముగాను ప్రమాదకరమైన మార్పులను తెచ్చిపెట్టునవిగాను ఉండనవసరములేదనియు, సందర్భశుద్ధిగా ఆచరణయోగ్యముగా సుస్పష్టముగా మన సభల తీర్మానముల రూపము ఆశయములు ఉండవలెననియు, ఎట్టి సంస్కరణములు - ఉద్యమములు అయినను కాలతత్త్వము కంటెను కూడ జాతీయాత్మకు అనుగుణ్యముగ నుండిననే శాశ్వత సత్ఫలితము లేర్పడగలవనియు మా విశ్వాసము.

భారతీయ నారీమణులు, విద్యకు, విజ్ఞానమునకు, సంస్కృతికి, సంగీత సాహిత్యములకు, లలిత కళాసంపదకు, ఆదర్శగృహిణీత్వమునకు, సేవాత్యాగములకు ప్రసిద్ధులై యుండిరనుట జగద్విఖ్యాతము కావలెననుటయే మా పరమ వాంఛితము.

# అఖిలభారత మహిళామహాసభ

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

★

ఈ 1941 వ సంవత్సరము డిసెంబరు కడపటివారములో కాకినాడయందు జరుగనున్న అఖిల భారతమహిళాసభ ఆంధ్ర మహిళలకు గొప్ప జాతీయోత్సవమనియే చెప్పవచ్చును. 1923 వ సంవత్సరములో కాకినాడయందే అఖిలభారత జాతీయ మహాసభ (కాంగ్రెసు) జరిగియుండెను. ఎందరో స్త్రీజనము నానా రాష్ట్రములనుండి అమ్మహాసభకు హాజరైయుండిరి. ఎంతయో మహోత్సవము మహావైభవోపేతముగ సాగియుండెను. కాని అది అంతయు నొకయెత్తు, నేటి మహిళాసభ యొకయెత్తు. ఏ మహాసభ జాతి మత కుల వివక్షతరహితయై భారతనారీలోకము నెల్ల నొక్క సూత్రమున నిబద్ధించి, ఒక్క కేంద్రమున సమీకరించి భారతమహిళాభ్యుదయమనెడి యొకేయొక కార్యమునకు నున్ముఖులను గావింప బాధ్యతవహించి పనిచేయుచున్నదో, ఏ మహాసభ భారతనారీమణుల ఏకగ్రీవాభిప్రాయమును ముక్తకంఠముతో జాటుటకు శక్తిని సామర్థ్యమును గలిగియున్నదో, ఏ మహాసభ దొరతనమువారి దృష్టికిని ప్రజల లక్ష్యమునకును స్త్రీల మన్ననకును పాత్రమైయున్నదో, ఏ మహాసభ అంతర్జాతీయ మహిళాలోకముతోగూడ పొత్తుగలిపి యావత్ప్రపంచ స్త్రీలోకమునందున్న భారతమహిళలకు గణనీయస్థానమును సంపాదింప గల్గినదో, ఏ మహాసభ భారతవర్షమునందలి విద్యాధికలు, సేవాధురీణలు, బుద్ధి వైశద్యవిశారదలు, ఉన్నతోన్నతాధికార సంపన్నలు, రాజకీయ పరిజ్ఞానలు, జమీందారిణులు, రాజ్ఞులు, మహారాజ్ఞులు నాదిగాగల సమస్త భారతనారీ సముదయమును నొక్కచో జేర్చి స్వీయమహిళాలోకోద్ధరణకార్య నిమగ్నలనుగా జేయుచున్నదో, ఆ అఖిలభారత మహిళా మహాసభ భారత స్త్రీజనముల యోగక్షేమముల విచారించుటకై, మనోగతాభిప్రాయముల విచారించుటకై, కర్తవ్యమును సూచించుటకై, ఐకమత్యమును సమకూర్చుటకై, కాకినాడ నగరమున సమావేశము కాబోవుచున్నది.

అప్పుడే దేశము నలుమూలల తాలూకా జిల్లా రాష్ట్రీయ మహిళాసభలు జరుగుచున్నవి. వందల కొలది వేలకొలది స్త్రీలు సమావేశమగుచున్నారు. స్త్రీవిద్యావిధానములో స్త్రీ జనానుకూలములగు మార్పులు కావలెననియు, స్త్రీలకు ప్రత్యేక కళాశాలలు పారిశ్రామికపాఠశాలలు కావలెననియు, రాజకీయములలో సంపూర్ణమగు ప్రాతినిధ్య మొసంగవలెననియు, ఉభయవంశముల (పుట్టిన మెట్టిన యిండ్ల)లో గూడ వారసత్వములు కావలెననియు, వివాహవయస్సు హెచ్చింపబడవలెననియు, కట్నముల దురాచారము నిర్మూలింపబడవలెననియు, దాయాదుల అనుమతిలేని స్వతంత్రమగు దత్తతాధికారము స్త్రీకి ఒసంగబడవలెననియు, రిజిష్టరైన మహిళాసంఘములకు స్త్రీ వోటరులను జేర్చు అధికార మొసంగబడవలెననియు, తీర్మానములు చేయుచున్నారు. ఇవియేగాక స్థానికముగా ఆసుపత్రులలో, విద్యాలయములలో, రైల్వేస్టేషనులలో, రైళ్లలో, స్థానిక సంఘములలో, స్త్రీలకు గలుగుచున్న అసౌకర్యములను గూర్చియు దీర్ఘములగు చర్చలుచేసి తీర్మానములు గావించుచున్నారు. నదీనదములన్నియు అపారపారావారమున సంగమించినట్లు పరశ్శతములగు నీ తీర్మానములన్నియు అఖిలభారత మహిళాసభ దెసకు ఉరుకులుపెట్టుచు బోవుచున్నవి.

మహా సంపన్నుడును మహాత్యాగియునగు మోతీలాల్ పండితుని గారాబుతనయ, దేశమునకై తన సర్వస్వమర్పించి భారతీయ ప్రజాహృదయమును చూరగొని హిందూస్థానమునకు మకుటములేని రాజను విఖ్యాతివహించిన జవాహర్‌లాల్ నెహ్రూ పండితుని అనుంగుచెల్లెలు, రంజిత పండితుని ప్రేమంపుటిల్లాలు, కాంగ్రెసు ప్రభుత్వములో సంయుక్తరాష్ట్రమునందు స్థానికశాఖామాత్యపదవిని చేపట్టి పాలనావిధానము గుర్తెరిగిన అనుభవజ్ఞురాలు, కాంగ్రెసు పరిపాలన యనిన పరిపాలన చెఱసాలయనిన చెఱసాల స్వీకరింప సంసిద్ధయగు క్రమశిక్షణురాలు, ఎందున్నను ఏ స్థితిలోనున్నను స్వీయనారీలోక సముద్ధరణను నేమరని స్వజాత్యభిమాన, యగు శ్రీమతి విజయలక్ష్మీ పండితసతి ఆధిపత్యమున సరోజినీనాయుడు, కమలాదేవి ఛటోపాధ్యాయ, లీలావతీ మున్షి, రాజకుమారి అమృతకౌర్, ముత్తులక్ష్మిరెడ్డి, ఆచంట రుక్మిణమ్మ, అమ్ము స్వామినాధన్, షానవాజు బేగమ్, కజిన్సు సతి, ఆదిగాగల నారీరత్నములుగల నిందు పేరోలగంబున నీ స్త్రీసమస్యలన్నియు చర్చితములై తీర్మానింపబడనున్నవి.

భారతమహిళల భవిష్యత్తు అఖిలభారత మహిళాసభమీదనే ఆధారపడియున్నది. ఈ సభ ఎప్పుడు బలీయమై పల్లె పట్టణముల వ్యాపించి భారతమహిళా హృదయము నాకర్షించి ముక్తకంఠముతో భారత మహిళాభిప్రాయమును వ్యక్తీకరింప నేర్చునో, ఆనాడు భారతమహిళల నోములు పండును. అక్కరలు తీరును. లోపములు తొలగును. వివాదములు పరిష్కృతములగును.

వర్తమానకాలమున వ్యక్తిగత వ్యవహారములకు విలువలేదు. సంఘశక్తియే శక్తి. సంఘము బలీయమైనప్పుడే ప్రపంచదృష్టి నాకర్షించును. కార్యము సానుకూలమగును. భారత నారీమణులు అభ్యున్నతి నొంద నెంచుచో నిట్టి సంఘబలమునే చేకూర్చుకొనవలయును. అట్టి సంఘీభావము చేకూరుట కిట్టి మహిళా సమావేశములే సాధనములు.

అఖిలభారత మహిళాసభ లిప్పటికి పదునాలు జరిగినవి. కాని అవి అన్నియు కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, అలహాబాదు, తిరువనంతపురము, మద్రాసు, మైసూరు మున్నగు మహానగరములందే జరిగినవి. కాన ఆంధ్రస్త్రీల కందుబాటు కాలేదు.

నేడు, ఏ నగరమునందు కాంగ్రెసు జరిగి దేశవిఖ్యాతిని సంపాదించెనో ఆ కాకినాడ నగరమున, తెలుగుసీమ నడిబొడ్డున, అఖిలభారత మహిళామహాసభ సమావేశము కానున్నది. కాన యావదాంధ్ర మహిళాలోక మీ కార్యకలాపమున బాధ్యత కలుగజేసికొని భారతదేశమునందలి పలుసీమలనుండి యేతెంచెడి నారీరత్నములను సగౌరవముగ సన్మానించి ఆంధ్రనారీమణుల అతిధిసత్కార కౌశలమును జగద్విదితము కావింపవలెను.

ఆంధ్రనారీమణులెల్లరు ఈ మహిళాసభయొక్క ఆహ్వానసంఘములో సభ్యురాండ్రుగా జేరి తీర్థయాత్రకు వెడలినట్లు లీ మహిళోత్సవమును దర్శింపనేగి ధన్యాత్మలు కావలెను.

కాకినాడ నగరలక్ష్మి నానాదేశాగత నారీలోకముచే కలకలలాడవలెను. భగవాను డనుగ్రహించును గాక !

---

# పత్రికారచయితలుగా స్త్రీ లొనరింపగల సేవ*

## శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు

(రేడియో ప్రసంగం)

ఇప్పుడు ఎటు చూచినా, ఎవరు చెప్పినా, సంఘసేవ, మతసేవ, మానవసేవ, దేశసేవ, లోకసేవ అని ఏకరువు పెట్టడం సహజమైపోయింది. నిజంగా ఆలోచించి చూస్తే మనం మన జీవితాలను సార్థకం చేసుకోవాలంటే మన తోడిమానవులకు చేతనైనంతవరకు సహాయకారులుగా ప్రవర్తించాలి. ఇది అందరికి సాధ్యమా అంటే అది చెప్పలేము. ప్రపంచంలో గొప్ప వక్తలు, గొప్ప వ్రాతగాళ్లు, గొప్ప సంస్కర్తలు, దేశాభిమానులు ప్రజాక్షేమమునకై పాటుపడుతూ తమ సర్వస్వమునూ ధారబోయుచుండుట మనం చూస్తున్నాం, వింటున్నాం. వీరందరికి సంఘంలో ఎంత గొప్ప స్థానముందో పత్రికా నిర్వాహకులకున్నూ అంత స్థానముంది. ఇంకా ఎక్కువగాయుంది అంటేకూడా తప్పులేదు. ఏమంటారా పత్రికా నిర్వాహకులు ప్రపంచమంతా నిష్పక్షపాతబుద్ధితో సింహావలోకనం చేస్తారు. ఎచ్చట లోటుపాటులున్నా చక్కగా దృష్టిఉంచి కనుక్కోగలుగుతారు. అంతేగాదు. ఆత్మవిశ్వాసము, స్వాతంత్ర్యం, సాహసం, వీరికి అన్ని విధాలా జయం కలుగజేస్తూ ఉంటాయి. జగత్కల్యాణకాంక్ష, దానికొఱకై సేవచెయ్యడం, ఇవే వారి ప్రధానాశయాలు. దానికితోడు పత్రికా నిర్వాహకులకు సహజభావాలు నూత్న వికసనాన్ని పొందుతూ ఉంటవి. సహజ భావా లున్నచోట చక్కని రచనావిధానం లేకపోతుందా? వీరి వ్రాతలలో ఆవేశము, చల్లదనము, ఉద్రేకము, హాస్యము, వివాదము, పటుత్వము, అన్నీ సమానంగా చకచక సాగిపోతూ ఉంటవి. అన్నిటికన్న ముఖ్యమైన విషయం ఒకటి మనం గుర్తించాలి. ఏమంటే పత్రికా నిర్వాహకుడు లోకులుచేసే దూషణ భూషణలకు లొంగడు. అతని కెంతసేపూ ప్రజాసేవమీదనే దృష్టి. ఇట్టి ఉత్తమమైన సేవ జేయుటలో స్త్రీలు పురుషులకు తీసిపోతారా? ఏమాత్రము తీసిపోరు. మనదేశం బాగుపడాలంటే మన సంఘం బాగుపడాలి. సంఘం బాగుపడాలంటే నిరక్షరాస్యత నిర్మూలం గావాలి. దీనికి స్త్రీలే ఎక్కువగా తోడ్పాటవుతారు. స్త్రీలు ఎప్పుడూ సేవాతత్పరులు-వీరే సంఘసంస్కర్తలుకూడా అయితే దేశ దౌర్భాగ్యం తొలగిందన్నమాటే. అంతేకాదు. పత్రికా నిర్వహణానికి స్త్రీలు పూనుకున్నారంటే మన సంఘంలోవుండే లోటుపాట్లు చక్కగా అవగాహన చేసుకొని వాటిని ఏఏవిధంగా సంస్కరించాలో గుర్తించి చక్కబెట్ట గలుగుతారు.

ఇది స్వాతంత్ర్యయుగం. అన్ని దేశాల్లోను, అన్ని ఆచారాల్లోను రోజుకురోజు పెక్కుమార్పులు తలచూపుతూన్నవి. వేయామడలదూరాన జరుగు విషయాల్ని సయితము ఎప్పటికప్పుడు తెలుసుకొనేందుకు ఇప్పుడు వీలుంది. దానికి తగిన పరిస్థితులు, పరికరాలు మన కందుబాటులో ఉన్నవి. ఈ రేడియోలు, తంతిలేని వార్తలు, అంటే-వైర్‌లెస్ టెలిగ్రాములు-ఇంక వార్తాపత్రికలు, మనకేనాటి వార్తలు ఆనాటికి తెలియచెప్పి నానావిషయాల్లోను మనకు ప్రబోధం కల్గించడం మనకు తెలుసు. పూర్వము సంవత్సరకాలానికి నేర్చుకోగల్గిన లోకజ్ఞానం ఇప్పుడు కొద్ది రోజులకే నేర్చుకుంటున్నాము. అట్టే చదువుసంధ్యలులేని సామాన్య తరగతి జనులకు సయితం ప్రపంచవిషయాలను తెలిపించి, దేశదేశాల నాగరికతను బోధపర్చి, లోకజ్ఞానాన్ని

* (ఆల్ ఇండియా రేడియో, మద్రాసు కేంద్రమువారి అనుమతితో)

కల్గించడం ఇప్పటి వార్తాపత్రికలే. ఇవే విశ్వగ్రంథాలంటేను. ఈ విశ్వగ్రంథపఠనం మూలాన్నే మన మనో వికాసం విజ్ఞానవికాసం పెంపొందుతుంది. దీనివలన మన మేధస్సేకాదు, హృదయంకూడ విశాలమవుతుంది.

పత్రికా నిర్వహణమంటే అదొక గొప్ప దేశసేవ. ఎలాగ అంటారేమో; ఒక పత్రికలో ఎన్నెన్ని విషయాలు ప్రకటించేస్తామో చూడండి. ఆర్థికసమస్య, నైతిక సమస్య, సాంఘిక సమస్య, స్త్రీ జనోద్ధరణ, రాజకీయాలు, పారిశ్రామిక సమస్య, వాణిజ్య విషయాలు, గృహవైద్యం, శిశు సంరక్షణ ఇంకా ఎన్నో విషయాలు ప్రజానీకాన్ని ప్రబోధపరచేవి_అంతేకాదు_దూరదేశాల్లోని విషయాల్ని ఏరోజుకారోజు తెలియపరుస్తూ, ఎప్పటికప్పుడు కొత్తకొత్త సూచనలిస్తూ పాఠకులకు ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని, ఉత్తేజాన్ని కలిగించవచ్చు. పాఠకుల అభిరుచినిబట్టి, చెప్పవలసిన ఏ విషయమునుగాని కథలుగాను, పాటలుగాను, పద్యాలుగాను, వ్యాసాలుగానూ, నాటకాలుగాను, రచించుట మంచిదే. కాని ఏ చిన్న విషయంగాని, పెద్ద విషయంగాని సాధారణ జనానికి బోధపరచాలంటే దాన్ని కథారూపంగా వ్రాయడం మంచిది. పిన్నలు పెద్దలు కథలంటే చాలా ఇష్టపడతారు. దాని మూలకంగా విషయాల్ని చక్కగా గ్రహిస్తారు. ముఖ్యంగా చిన్నపిల్లలకు కథలూ, పాటలూ అంటే చాలా సరదా. కొంత నీతినీ, విజ్ఞానాన్నీ తెలియజెప్పే పత్రికల్లోని శీర్షికలు చిన్నపిల్లలకి బాగా ఉపకరిస్తాయి. వారికి చూచిన విషయాల్లోగాని, విన్న విషయాల్లో గాని, తరిచిచూచే గుణం సహజంగా ఉంటుంది. దాన్ని గ్రహించిన తల్లి అయితే బిడ్డల శరీరపోషణతో పాటు బుద్ధి వికసనానికీ తోడుపడుతుంది. బడులలో నేర్చుకోలేని అనేక సంగతులు పత్రికల్లో వెలువడే బాలసారస్వతంలో నేర్చుకోవడానికి వీలుంటుంది. చిన్నపిల్లల తత్వం వేరు. వారి మనస్సు అతి సున్నితమైనది. వారికి ఆటల్లోనూ పాటల్లోను ఉన్నంత సరదా, ఉత్సాహం మరి దేనిలోను ఉండదు. దీనిని గ్రహించి రోజూ వారి కళ్లముందు కనబడేవాటిని గురించి ఎంత సులభంగా, ఎంత ఆకర్షవంతంగా వ్రాస్తే, వారంత శ్రద్ధతో చదువుతారు. వారికి చెప్పవచ్చిన విషయాల్ని బాగా వర్ణనచేసి వారికళ్లకు కనపడేటట్లు, హృదయానికి హత్తుకొనిపోయేటట్లు వ్రాయాలి. ఇంకా వీలైతే వర్ణచిత్రములతోకూడ వారిముందు పెడితే త్వరగా అవగాహనం చేసుకుంటారు; చిరస్థాయిగా వారి మనస్సులలో నిలుపుకోవటానికి అవకాశం ఉంటుంది. కొన్ని విషయాలు చిన్నపిల్లల పరిభాషలోనే సంభాషణరూపంగా వ్రాయవచ్చు. దానివలన ఇద్దరు ముగ్గురు పిల్లలు కలిసి చదువుకొని ఆనందభరితులవుతారు. అప్పుడు వారిలో చర్చించుకొనే శక్తికూడా వృద్ధిచెందుతుంది. ఇలాంటివి చదువుతూంటే కొన్నాళ్లకి పిల్లలకుకూడా అలాగే వ్రాయాలనే ఆసక్తి కలుగుతుంది. వ్రాస్తారుకూడాను. ఈ విధంగా పత్రికానిర్వాహకులు పిల్లలకునూ సేవ చేస్తారు.

అంతమాత్రమే కాదు. గొప్పగొప్ప వ్యక్తుల జీవితచరిత్రలు, దేశయాత్రలు విశదముగా వ్రాసి చదువరులకు విద్య కలుగజేస్తారు పత్రికా నిర్వాహకులు. జీవిత చరిత్రలవలన తమ జీవితాలనుకూడ అట్లే శోభాయమానంగా వెలిగించాలనే ఆశ పొడముతుంది పాఠకులకు. సాధ్యమయినంతవరకు ప్రయత్నిస్తారు. ఒకప్పుడు కాకపోయినా మరొకప్పుడు సిద్ధహస్తులవుతారు. ఇక దేశయాత్రాది అనుభవములు మనకెలా ఉపకరిస్తాయంటే, అందరికీ అన్నిదేశాలు తిరిగి అచ్చట విశేషాలు చూచి రావటానికి వీలుంటుందా? పరిస్థితుల్నిబట్టి ఏ కొద్దిమందికో మాత్రమే ఆ భాగ్యం లభ్యమవుతుంది. తదితరులకు ఆయాదేశాల ఆచార వ్యవహారాలు, నాగరికత, దేశసౌభాగ్యం, స్త్రీ పురుషుల స్నేహ సౌభ్రాతృత్వం, జీవన విధానం, భాష,

కట్టు, బొట్టు, భోజనం ఆదిగా గల విషయాలు తెలియాలంటే అనుభవజ్ఞుల దేశయాత్రలు బాగా పనికి వస్తాయి. అచ్చటచ్చట గల విశేషాలను చిత్రపటములతో సహా ప్రకటించి సులభశైలిలో చక్కగా వర్ణించి పాఠకుల కందిస్తే నిజంగా అంతయాత్ర వారే జేసినట్టు ముగ్ధులైపోతారు. కవులకు, పత్రికా నిర్వాహకులకు, చదువరులను తమతోపాటు తిన్నగా నడిపింపగల నేర్పు, చతురత, సహజంగా ఉంటుంది. ఇదే వీరికి గల ప్రత్యేకత.

ప్రపంచంలో ప్రజల చిత్తవృత్తులు చాలా విచిత్రంగా వుంటాయి. ఒకరికి మేలుగా తోచింది మరొకరికి కీడు-ఒకరికి కీడుగా తోచింది మరొకరికి మేలు అవుతుంది. ఇదంతా లెక్కచేస్తే పత్రికా నిర్వాహకుని పని నెరవేరడం దుస్తరం. ఎంతో ధృఢచిత్తంతో, ఆత్మవిశ్వాసంతో, దేశాభిమానంతో పనికి పూనాలి. అది నెరవేరుతుందా లేదా అనే ప్రశ్న తేనక్కరలేదు. తన మార్గంలో విషమపరిస్థితులెన్నో అడ్డుతగులు తుంటాయి. అప్పుడు వాటిని ధైర్యంతో ఎదుర్కోవటానికి గుండెనిబ్బర మవసరం. స్వార్థరహితంగా తైల ధారవలె అవిచ్ఛిన్నంగా, అంటే ఏకదీక్షతో, తనపని సాగించాలి. దేశౌన్నత్యానికీ, సంఘౌన్నత్యానికీ పత్రికా నిర్వాహకులే ఆధారభూతులు. కవులు, సంస్కర్తలు, ప్రచారకులు - వీరందరికంటె గొప్ప బాధ్యత పత్రికా నిర్వాహకులపై వుంది. కాలానికి తగినట్టు సంఘంలో కలిగే మార్పులను వీరు అతి త్వరితముగా గ్రహింపగలరు. గ్రహించినదానిని నలుదెసలకు వ్యాపింపజేసి సంఘవ్యవస్థ ఎచ్చట కుంటువడియుందో దాన్ని చూపించి ఎట్టి మరమ్మతు అవసరమో కూడా విశదీకరింపగలరు. ఇట్టి బాధ్యతాయుత స్థానమును స్త్రీలు వహింపగలిగితేనే, మన దేశసౌభాగ్యము మరల రేకెత్తగలదు. దీనికి ఉన్నతవిద్య ముఖ్యావసరం. గృహ ధర్మం, సంఘధర్మం, జాతిధర్మం-వీటిని చక్కగా నిర్వహించుటకు అనువైన విద్య స్త్రీలకిప్పుడు కావాలి. ఎట్టి నాగరికతలుగాని మున్ముందు గృహమందే పుట్టుతవి. మన పిల్లలకు ప్రత్యేకించి మనం నేర్పకున్నాగాని, నిత్యజీవితంలో మనమాచరించు దినచర్యలు వారికి బాగా పట్టుబడిపోతాయి. కాబట్టే గృహవాతావరణం నిర్మలంగా ఉండాలి అంటారు పెద్దలు - స్త్రీ దృష్టిలో తన ఇంటియందు పతి సుతులకు చేయు సేవకు, సంఘసేవకు, దేశసేవకు అట్టే భేదము కానుపించదు. అన్నిటిలోను తనకు సమానధర్మము ఉందని విశ్వసిస్తుంది. పురుషులకంటే స్త్రీలే తమ బాధ్యతలను ఎక్కువ చక్కగా నిర్వహిస్తారు. స్త్రీ ఎప్పుడూ సేవాతత్పర. కనుకనే ఆస్పత్రులలోగాని, మరెచ్చటగాని రోగులకు సేవచేయటానికి నర్సులుగా నియమింపబడుతారు స్త్రీలు. ఇంతకూ స్త్రీలకు విద్యాగంధం చాలకపోవటం మూలాన్నే వెనుకబడిపోయారు. అది ఇప్పుడు చాలావరకు పట్టణవాసాల్లో అంతరించింది. పల్లెటూళ్లుమాత్రం ఇంకా అధోగతిలోనే వున్నవి. అచ్చటి స్త్రీలలో ఉన్నతవిద్య అట్టే ప్రాకలేదు. అది సంఘానికి ఒక లోపమే. ప్రతి సోదరియు విజ్ఞానమునిచ్చు ఉత్తమవిద్యను పొందునట్లు చూడాలిసింది, మనధర్మం. మనం ప్రయత్నించాలి. ఆర్థిక, సాంఘిక, పారి శ్రామిక, నైతిక, సారస్వత సమస్యలలో ఇంకా ఎక్కువగా చేయికలుపుకోవాలి. కాలచక్రం తిరిగిన కొద్దీ అనేక మార్పులు వస్తున్నాయి. దాన్ని అనుసరించే అన్నిదేశాలు ముందడుగువేస్తాయి. మనకుమాత్రం అంత చొరవలేమా? జాతీయత పెంపొందాలంటే దేశములో ఐకమత్యం కావాలి. స్త్రీలూ, పురుషులూ సర్వతో ముఖమైన మేధాసంపన్నులు కావాలి. పిచ్చి ఆచారాలు, మూఢనమ్మకాలు అంతరించాలి. ప్రపంచతత్వ పరిశోధన చేయాలి. అప్పుడే మన పరిస్థితులను చక్కగా గుర్తించగలము. దీనికి తగినంత ఆందోళన, కృషి, స్త్రీలే పూనుకొని చేసి నిద్రాణమైయున్న శక్తులన్నిటిని ఒక్కొక్కటిగా మేలుకొల్పాలి.

---

# మేరీ క్యూరీ సతి

★

## శ్రీమతి మైదవోలు పద్మావతీదేవిగారు

★

( గతసంచిక తరువాయి )

పదునెనిమిదివందల తొంబదియేడవ సంవత్సరము సెప్టెంబర్ పం(డెండవ తేదీన మేరీకి వొక పుత్రిక జనించినది. తండ్రి యొక మహామేధావియని పైన చెప్పియున్నాను. తల్లి విషయమై చదువుచున్నారు. ఇక యాదంపతుల కుదయించినబిడ్డ విషయమై యడుగవలయునా? అయినను ఒక్కమాట చెప్పెదను. అది చెప్పిన తనయ యెంత మేధావినియో చదువరులే గ్రహింతురుగాక.

స్వీడన్ దేశమున ఆల్ఫ్రెడ్ నోబెల్ (Alfred Nobel) యను నొక మహనీయుడుండెను. అతడు శాస్త్రములందు అభిరుచిగలవాడు. మానవసేవయే జీవితపరమావధియని యెంచెడివాడు అతడు యింజినీర్ వృత్తిచే కోట్లకొలది ధనము గడించి, కొన్నికోట్లు ధర్మమున కొసంగెను. ధర్మమన్న నిరుపేదలకు ధన మొసంగుటకాదు. మానవ సహాయమును, ప్రపంచశాంతిని నెలకొల్పు మహానుభావుల కాధన మొసంగునట్లు యేర్పాటుచేసెను. ప్రతి సంవత్సరము వొక్కొక్క శాస్త్రమునందును ఘనతవడసిన ఐదుగురికి ఒకొక్కరికి లక్షఎనుబదివేలు ఒసగునట్లు ఆ ధర్మాత్ముని కోరిక. కోట్లకొలది రోగులను బాగుచేయు ఔషధమును కని పెట్టిన వైద్యునికి, వాఙ్మయమున కలంకారము గూర్చు కవికి, పదార్థవిజ్ఞాన శాస్త్రములో పరిశోధనలు సల్పు విజ్ఞానికి, క్రొత్తక్రొత్త పరిశోధనలు కనిపెట్టు రసాయన శాస్త్రజ్ఞునికి, ప్రపంచశాంతి నెలకొల్పు శాంతి దూతకు ఆ బహుమాన మొసంగవలయునని నోబెల్ మహాశయుని యాదేశము.

పదునెనిమిదివందల తొంబదియారవ సంవత్సరమునుండి మహదంశగలవారు యీ బహుమానముల పడయుచునే యున్నారు. హిందూదేశమునకూడా యిరువురు మహనీయులు యీ బహుమానమును పడసిరి. విదుషీమణులు అయిదుగురు యీ బహుమానముల నందిరి. ఐతే సైన్స్లో ఏ స్త్రీకీ రాలేదు. మేరీక్యూరీయే మొదటిది. అంతియేకాదు. ఆ నోబెల్ప్రైజ్ రెండుమారులు అందుకొనిన మహావిజ్ఞాని, మేరి ఒక్కర్తియే. పందొమ్మిదివందల మూడవసంవత్సరము మేరీకి, ప్యారీకి కలిపి యిచ్చిరి. భర్తతోకూడా పంచుకొనినది. పందొమ్మిదివందల పదునొకండవ సంవత్సరము మేరి వొక్కర్తియే యాబహుమాన మంది స్త్రీలలో మేటి యైనది. ఈ విషయము ప్రపంచ చరిత్రలో అసామాన్యమైనది. నోబెల్ప్రైజ్ రెండుమారులు గ్రహించిన వారు నేటివరకు లేరు. ఆ గౌరవము మేరికే దక్కినది. మేరీవలన స్త్రీ జాతికంతయు దక్కినది. స్త్రీల గౌరవమును మేరీ యంతటితో నిలుపలేదు. నోబెల్ప్రైజ్నందిన మేరీ, నోబెల్ప్రైజ్నందిన కుమార్తెను కనినది. మేరీ, నీవు ధన్యురాలవు! నీ జన్మ ధన్యము! నీవలన స్త్రీజాతియే ధన్యమైనది! ఒకే కుటుంబమున నోబెల్ప్రైజ్ నందినవారు ముగ్గురుండుటకూడా వీరి కుటుంబముననందే! నేటివరకు అయిదుగురు స్త్రీలు నోబెల్ప్రైజ్ పొందియున్నారు. అయిదుగురిలో ఇరువురు సైన్సుకు బహుమానమందిరి. ఆ ఇరువురు యీ మాతా తనయలే!

ఇక కథాంశమునకు వత్తము. మేరీకి శాస్త్రపరిశోధనలయందు యభిలాష ఎంతమెండో గృహకృత్యము లందు కూడా యామెకు అంతియే. తన కుమార్తె ఐరీన్‌కు తానే స్తన్యమిచ్చి పెంచినది. చాలా రోజుల వరకు మేరీ దాదినికూడా వుంచలేదు. ఆమె లెబారెటరీలో చేయు పరిశోధనల కంతేలేదు. విధివిరామము లేక ఆమె యింటను బయటనుకూడా పనిచేయుచుండెను.

క్యూరీ దంపతులకు వారి పరిశోధనలకై ప్రత్యేక స్థలము కావలసియుండెను. చాలా కష్టముమీద నొక భాగ్యశాలి తన కొట్టమును వీరికి వుపయోగార్థమై ఒసంగెను. ఆ స్థల మంత ప్రశస్తమైనది కాదు. క్యూరీ దంపతులుతప్ప యితరులెవ్వరు ఆ స్థలమును ఆశించివుండరు. తమ కార్యావసరమునకై యా కొట్ట మిచ్చిన భాగ్యశాలికి క్యూరీలు యెంతయో కృతజ్ఞులై ధన్యవాదము లర్పించి యందు పనిచేయదొడగిరి. ఆ కొట్టమే నేడు వేలకొలది జనులకు యాత్రాస్థలమైయున్నది.

లెబారెటరీలో విద్యార్థులకు పాఠముచెప్పుటకాగానే ప్యారీ షెడ్డ్‌లో మేరీని కలుసుకొనెడివారు. ఇరువురును అచట చాలా సేపువరకు రిసెర్చిలు చేయుచుండెడివారు. రేడియమును తయారుచేయుటకు వలసిన లోహము, సామగ్రి దొరుకుటకూడా వారికి దుర్లభముగ నుండెను.

ఆ కష్టపరంపరలతో, తీరని శ్రమముతో పరిశోధనలు సలిపిన నాలుగువత్సరముల కృషిఫలితమే రేడియమ్. ఇరువురు భాగస్వాములైనను రేడియమ్‌ను ముందు కనుగొన్నది మేరియే. పందొమ్మిదివందల మూడవసంవత్సరము రేడియమ్ కనిపెట్టినందులకై యాదంపతులు నోబెల్ ప్రైజ్ నందిరి.

రేడియమ్ కనిపెట్టిననాటినుండియు, యేమూలనో వున్న క్యూరీదంపతులు ముంగిటికి వచ్చిరి. గౌరవ పదవులెన్నియో వీరికి కలిగెను. ఐరోపాఖండమునసున్న యన్ని కళాశాలలవారును యీ దంపతులను, తమ కళాశాలలయందు యాచార్యత్వమును వహింపగోరిరి. కాని క్యూరీలు తమకు చేయూత యొసగిన సార్బోన్ విశ్వవిద్యాలయమును, పారిస్‌నగరమును విడువదలచుకొనలేదు.

మేరీ యన్ని సంఘములయందును గౌరవ సభ్యురాలుగ యెన్నుకొనబడెను. దాదాపు యిరువది విశ్వవిద్యాలయములయందు డాక్టరేటు డిగ్రీలను పొందెను. ఇక బంగారుపతకములు, ప్రైజ్‌లు లెక్కయే లేదు. అన్నిటికిని తలమానికమువంటిది నోబెల్ ప్రైజ్.

అన్ని ఖండములనుండియు, యన్ని దేశములనుండియు క్యూరీ దంపతుల కాహ్వానములు రాసాగెను. సన్మానములకై సంఘములపై సంఘములు ఆహ్వానములు పంపిరి. అట్టహాస ఆడంబరములు గిట్టని క్యూరీ దంపతులకీ యాహ్వానములు కంటగింపై యుండెను. సాధ్యమైనంతవరకు జనసమూహమును తప్పించుక తిరుగుచు, విధిలేని సందర్భములయందు వెళ్లుచుండిరి,

పందొమ్మిదివందల నాలుగవసంవత్సరమున, నవంబరువరకు, భర్తతో లెబారెటరీలో పనిచేయు చుండెను కాని యామెకు వేతనములేదు. నవంబరునుండి మేరీకి జీతమేర్పాటు చేసిరి. ఆసంవత్సరమే మేరీకి మరియొక కుమార్తె కలిగెను.

పందొమ్మిదివందల యారవసంవత్సరము ఏప్రిల్ పందొమ్మిదవతేది ప్రొద్దున తొమ్మిది గంటలకు ప్యారీ భార్యా బిడ్డలతో రొట్టె, టీ పుచ్చుకొని, భోజనమునకు మధ్యాహ్నము రెండుగంటలకు వత్తుననియు,

భుజించి యిరువురము లెబారెటరీకి వెళ్లుదమని తెల్పి, భార్యను వీడ్కొని, యూనివర్సిటీకేగి తిరిగి యింటికి వచ్చునపుడు లారీక్రిందపడి తలబ్రద్దలై ప్యారీ తక్షణమే మరణించెను.

మహామేధావియగు ప్యారీ క్యూరీ జీవిత మీవిధముగ ముగిసెను.

మేరీ కిది పెద్ద గొడ్డలిపెట్టు. పాపము! భగవంతుడు వారి యన్యోన్యము సహింపక, యీవిధముగ యెడబాటు కల్పించి సంతసించెను కాబోలు. ప్యారీ యకస్మాత్మరణము మేరీని పిచ్చిదానిని చేసెను. మేరీకి జీవితము దుర్భరమనిపించెను. తన దుఃఖమును లోలోపల యడంచుకొనినది కాని వెలికి చూపలేదు. లెబారెటరీలో కలిసి పనిచేయు ప్యారి లేక మేరి ఒంటరికత్తె యాయెను.

క్యూరీలతో ప్యారీ తండ్రి వసించుచుండెను. ప్యారీ మరణానంతరము ప్యారీ తండ్రి పెద్దకుమారుని కడకు పోవ సంకల్పించెను. ప్యారీ తండ్రిని పంపుటకు మేరి ఒప్పుకొనలేదు. తండ్రి సమానుడగు మామగారిని తనవద్దనే నిలుపుకొనెను. మేరి మామ జీవితవిశేషమంతయు మేరి కడనే గడిపెను.

పారిస్ నగరమున ప్యారీ మరణము ప్రజలను తీవ్రసమస్యలకు గురిచేసెను. ప్యారీ పూర్తిచేయక వదలిన పరిశోధనలగతి యేమికావలయును? మహామేధావులకే యర్హమై వారిచే యలంకరింపబడు సార్బోన్ యూనివర్సిటీలోని యాచార్యత్వమును వహించునది యెవరు? ఇక మేరి, యిరువురి బిడ్డలతో, మామగారితో యెట్లు జీవనము గడుపును? మేరి భావిగతి యేమి? ఇవియే ప్రజల సమస్యలు. ఈ సమస్యలచే ప్రజ లాందోళన పడజొచ్చిరి. ప్రజలే కారు, మేరి భావిజీవితమేమని ఫ్రెంచ్ గవర్నమెంటువారుకూడా తీవ్రాలోచన చేసిరి. గవర్నమెంటువారు మేరికి పెన్షన్‌వలె కొంత డబ్బిచ్చుటకు సంకల్పించి, యా వార్త మేరికి తెలియచేసిరి. మేరి నిర్మొగమాటముగ పెన్షన్‌ను తిరస్కరించినది. 'నేనింకను వృద్ధురాలిని కాలేదు. జవ సత్వము లుడుగ లేదు. నేను వుద్యోగముచేసి నా పిల్లలను సంరక్షించుకొనగలను. మీ పెన్షన్ నాకు వలదు.' ఇవి క్యూరీ పలుకులు. మేడమ్ క్యూరీ తప్ప యితరులెవరైనను యీ సదవకాశమును పోగొట్టుకొందురా? పెన్షన్ నిరాకరించు పిచ్చివారెవరైన వుందురా?

మేరి ధైర్యసాహసముల కలరి భర్త యధిష్ఠించిన యాచార్యపీఠమును మేరికి గవర్నమెంటువారొసగిరి. ఇదియే ఫ్రెంచ్‌వారు మేరికి చేసిన యసాధారణమైన గౌరవము. ఇదివరకు యింతపెద్ద పదవి ఏ దేశములోను యే స్త్రీకిని లభింపలేదు. ఆ పీఠమేమి సామాన్యమైనదా? మహామేధావియగు భర్త యలంకరించిన పీఠము! మహామేధావు లధిష్ఠించు పీఠము. భర్త యధిష్ఠించిన పీఠము భార్య యలంకరించుట ప్రపంచ చరిత్రలో యిదియే మొదటిది. ఇప్పటివరకు ఆ గౌరవము మేడమ్ క్యూరిదే. మేరి కాపదవి లభించుట మాత్రమే కాదు; ఆమె యీ యాచార్యత్వము ముందధిష్ఠించినవారి కీర్తికి లోపము రానీయక చక్కగ నిర్వహించెను.

పందొమ్మిదివందల పదునొకండవ వత్సరము మేడమ్ క్యూరీకి రెండవమారు కెమిస్ట్రీ (chemistry) కి నోబెల్ ప్రైజ్ వచ్చినది. మొదటి బహుమానము భర్తతో పంచుకొన్నది. రెండవమారు యీ కీర్తి తన కొక్కర్తెకే దక్కించుకొన్నది.

ప్యారీ సగముచేసి వదలిన పరిశోధనలుకూడా మేరి పూర్తిచేసెను. గొప్పగొప్ప శాస్త్రజ్ఞులు మేరీ పరిచయమునకై తహతహలాడుచుండిరి. మేరికి సైన్సు విద్యార్థులు దినదినాభివృద్ధి కాసాగిరి. ఈ రిసర్చ్‌ల

చేతను, పని యెక్కువచే కలుగు శ్రమచేతను, సహజముగ దుర్బలయగుటచేతను మేరీ పలుమారు జబ్బుపడుచుండెడిది. మేరీ తన జబ్బును లెక్కచేసెడిదే కాదు. ఆమెచేతులెప్పుడును బొబ్బలెక్కి పొంగియుండెడివి. వేటినీ మేరి లక్ష్యపెట్టెడిదే కాదు.

పందొమ్మిదివందల పదునాలుగవ సంవత్సరము ప్రపంచయుద్ధము ప్రారంభమాయెను. మేరీ తన ధనమంతయు యుద్ధనిధికొసంగి తన రాజభక్తిని వెల్లడించెను. మేరీ తనకు లభించిన బంగారుపతకములుకూడా నిధికొసంగి సొమ్ము చేసుకొమన్న, యుద్ధనిధిసంఘమువా రొప్పుకొనక, యా పతకముల వాపసుచేసి క్యూరి త్యాగమును వేనోళ్ల కొనియాడిరి.

యుద్ధపు రోజులలో మేరి నర్సుగా పనిచేయుచుండెను. ఆ నాలుగువత్సరము లామెకు నిద్రాహారములు లేవు. మేరి యేపని చేయదొడగినను ఇరువదినాలుగుగంటలు చేసెడిదే కాని కొంతైనను విశ్రాంతి తీసుకొను టెరుగదు. తలచినచోటునకు వెళ్లుటకై యామె కారు నడుపుటకుకూడా నేర్చుకొనెను.

ఒక యాంబులెన్సు (Ambulance) కారు తన స్వాధీనమొనరించుకొని యామె యహర్నిశలు తిరుగుచునే యుండెను. ఆ నాలుగువత్సరములు గాయపడినవారికి చికిత్సచేయుటయందే మేరి మగ్నురాలై యుండెను.

పందొమ్మిదివందల ఇరువదవ సంవత్సరమువరకు మాడమ్ క్యూరీ యితర ఖండములలో యడుగుపెట్టలేదు. అమెరికానుండి యెన్ని యాహ్వానములు వచ్చినను యామె కదలలేదు.

పందొమ్మిదివందల యిరువదవ సంవత్సరము అమెరికానుండి ఒక కోటీశ్వరురాలు క్యూరీని దర్శింపవచ్చెను. మేరి యా యమతో అమెరికా విషయమై ముచ్చటించుచూ, మాటలసందర్భమున, అమెరికాలో రేడియమెంత దొరకవచ్చునని ప్రశ్నించెను. ఆ కోటీశ్వరురాలును అమెరికాలో ఏబది గ్రామ్‌ల రేడియమున్నదని తెల్పుచూ, ఫ్రాంస్‌లో యెంతవున్నదని తిరుగ ప్రశ్నించెను. క్యూరీ చిరునవ్వుతో నా లెబారెటరీలో నొక గ్రామ్‌కూడా లేదని వుత్తరమిచ్చెను. భాగ్యవతియగు యా యమెరికా దేశస్థురాలు ఆశ్చర్య సంభ్రమములు ముప్పిరిగొన రిత్తపోయెను. 'ఏమిది! రేడియమ్ కనిపెట్టిన మేధావినికడ రేడియమ్‌నకు కొదువా? ఒక గ్రామ్ రేడియమ్‌కూడా లేదా, యంతకన్న తక్కువయేనా?' యని యామె మేరీని ప్రశ్నించెను. అందులకు మేరి 'నేచెప్పునది నేను పనిచేయు లెబారెటరీలోని రేడియమ్‌నుగురించి. స్వంతముగ నాకేమియు లేదు.' ఈ మాటల కామె మరింత యాశ్చర్యము నొందెను.

మేరి త్యాగమును గురించి యిచట ఒకమాట చెప్పవలసియున్నది.

రేడియమును కనిపెట్టినపుడు, క్యూరీదంపతులు, సర్వహక్కులు పొందియుండినచో కోట్లకు పడగెత్తెడివారే. ప్యారీ యా హక్కులు పొందవలయునని సంకల్పించి మేరీతో సంప్రదించెను. అసామాన్యాధికారమును పొంది, స్వార్థమునకు, తమ ఐశ్వర్యలాభమునకై, వినియోగింప మేరి యిష్టపడలేదు. కనుక భర్త పలుకుల కామె యియ్యకొనలేదు. రేడియమ్ ప్రజలకందరికి వుపయోగపడవలసిన వస్తువు; సర్వహక్కులు సంపాదించి కోటీశ్వరులము కావలయునన్న కోర్కె మనకుండరాదని భర్తను మందలించినది!

(సశేషము)

# భక్తినావ

శ్రీమతి శ్రీరంగం సూర్యకాంతమ్మగారు

అనేకులు సంసారమున పడరాని కష్టములపడుచు అధిక దుఃఖభాజనులై అంతులేని సముద్ర ప్రయాణము చేయుచుండుట మనకు చిరకాలమునుండి విశదమే. పిపీలికాది బ్రహ్మపర్యంతము సంసారము దుఃఖమయమని తెలిసియే తిరుగ దాని నభిలషించుచుండిరి. సంసారమువల్ల గల్గు బాధలచే ఆత్మ యెంత క్షోభించినను విషయ వాంఛాపరత్వమున యింద్రియ సుఖమునకు ఆశించుట యింత బాధయును తెలియకున్నది. ఆత్మ సందర్శనము జేయ కాంక్షించు యోగపురుషులుకూడ యింద్రియవశులై కుమార్గపరులై మనతో సమతుల్యులగుచున్నారు. దేవత్వముబొంది అణుమాత్రావశిష్టులై అత్యధికులమని గర్వించు దేవతులకుకూడ సంతానములు, సంబంధములు గలుగుచుండుటచే వారును యీ మాయాజాలమును దాటలేకపోవుచున్నట్లు తెలియుచున్నది. ఇక వీరు వారని సంశయములేక సృష్టియందు ప్రతివారును యీ సంసారచక్రమున బడి దుఃఖించుచున్నవారె అనక తప్పదు. అందుచే యెల్ల శరీరధారులు యీ మాయాజాలముచే కప్పబడి విముక్తమార్గమును జూడలేకున్నారు. సంసారమునబడిన సంసారి, తన కర్తవ్యము నెఱుంగకుండుటకు గొప్పలోభము మాయాబంధమే. అట్టి మాయలోబడు ప్రతిజీవియు మాయావతీర్ణతకు దలచక అనగా జన్మరాహిత్యమునకు తలంపక తాము అనుభవించు సౌఖ్యముకన్న గొప్పదగు యింకొక సౌఖ్యము అనుభవించుదుమని దుర్భ్రమలో మునుగుచున్నారు. "క్షీణేపుణ్యే మర్త్యలోకే విశంతి" అనునట్లు తిరుగ కర్మావశేషమున పతనము తప్పదు. అట్టిచో మాయాబలముచే కొంతమంది భూలోకమందున్న సౌఖ్యములకన్న దేవలోకమునందున్న సౌఖ్యములు గొప్పవని యజ్ఞాదిక్రతువులు చేయుచున్నారు. మరి కొంతమంది యిష్టాపూర్తములు అనగా చెరువులు నూతులు త్రవ్వించుట, బ్రహ్మప్రతిష్ఠ, వివాహములు చేయుట మొదలగునవి చేయుచున్నారు. దేవతలుకూడ వారు అనుభవించు స్వర్గాదిసుఖములకన్న బ్రహ్మాండ బహిర్గత మహామణిపురాదులకుబోయి అచ్చట సుఖించుదుమని కోరికలున్నట్లు గ్రంథాంతరముల కనుపించుచున్నది. గాని యెంత యుత్కృష్టకర్మలచే పూతులైనను యే లోకాదులకు బోయినను తిరుగ యీ సంసారచక్రమున బడుచున్నారు. అందుచే శ్రీకృష్ణభగవానుని వచన ప్రకారము "మమమాయా దురత్యయా। మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే" అనునట్లు నా మాయను దాట నుద్యుక్తుడగు ప్రతిజీవియు నన్ను ఆశ్రయించినగాని, దాటనేరడు. తన్ను ఆశ్రయించుట అనగా ఒక్కభక్తిచేతనే.

క॥ "చిక్కడు వ్రతముల క్రతువుల చిక్కడు దానముల శౌచ శీల తపములన్
చిక్కడు వృత్తిని భక్తిని జిక్కినక్రియ నచ్యుతుండు సిద్ధముసుండీ."

భక్తిచే బద్ధుడైనట్లు వేరొకదానికి లభింపడు. భక్తి అనునది శ్రేష్టమగు ప్రేమభావము గలిగియుండుట. భక్తి అనేకవిధములుగ నున్నది. అందు మూడు విధములగు భక్తులు గలవు. రాగాత్మభక్తియు, అహేతుకభక్తియు అనునవి. రాగాత్మక భక్తి అనునది: యే ప్రయత్నములేక తనంతటతాను భగవానునికొరకు వ్యాకులము జెందు వాని భక్తికి రాగాత్మకభక్తి అందురు. పుత్రులను, ధనమును మొదలగువానిని కోరక కేవలము శ్రీ భగవానుని చరణములు కోరుటయే అహేతుకభక్తి యందురు. దీనినే నారదుడు, శాండిల్యుడు మొదలగువారు చేయుచుందురు. మూడవది ముఖ్యభక్తి. ఇది కేవలము "యదిభవతి ముకుందే భక్తి నానందసాంద్రా విలుఠతి

చరణాబ్జే మోక్షసామ్రాజ్యలక్ష్మీః॥ అనునట్లు జ్ఞానముచేత చూచు భక్తికే, ముఖ్యభక్తి యందురు. ముక్తి భక్తికి యెప్పుడును దాసి. ఇందునుండి వైధభక్తియు, సహేతుకభక్తియు, గౌణభక్తియు గలిగినవి. యెప్పుడును శాస్త్రములమీద ఆధారపడుభక్తి వైధభక్తి. కావున భక్తిభావము పుట్టునంతవరకు వైధభక్తిని నవలంబింపవలయును.

ఏదో హేతువును పురస్కరించుకొని సహేతుకభక్తి జనించును. ఈశ్వరుడు సుఖసంపదలను నొసంగుచున్నాడనియు ఆయనతో సముడు మరియొకడు లేడని తలచిన, దానినే సహేతుకభక్తి యందురు. మూడవది గౌణభక్తి. ఇది గుణభేదములవలన మూడు విధములు. సాత్విక, రాజస, తామసము లని అందురు. ఆర్తాది భేదములవలన నాల్గువిధములగు భక్తులు. 'ఆర్తో జిజ్ఞాసు అర్థార్థీ జ్ఞానీచ భరతర్షభా' అనగా తాను దగుల్కొనిన విపత్తునుండి తప్పించుటకు భగవానుని ప్రార్థించుట ఆర్తభక్తి. భగవత్తత్వమును తెలిసికొనవలయునను కోరికతోడ ఆ విషయముల నాలోచించుట జిజ్ఞాసు భక్తి. ఏదో యొక అర్థమును అనగా డబ్బును సంపాదించుటకు భగవంతుని ప్రార్థించుట అర్థార్థీ భక్తి. కేవలము జ్ఞానముచే మోక్షమును అపేక్షించునది మోక్షభక్తి. అనగా జ్ఞానభక్తి. భక్తి అనుదానికి జాతి, మతభేదములు, వయస్సు అనునవి ప్రయోజనములు గావు. ప్రతివారును భక్తి ఉత్పన్నమైనది మొదలు దానిని చేయుచుండవలెను. కొంతమంది అభిప్రాయము బాల్యమునందు భక్తిసాధనము చేయుట యుక్తమనియు, సంసారమున మునిగియుండుటవలన భక్తిబీజము మొలకలెత్తుట కొంచెము కష్టమగుననియు తెలియజేసిరి. అదియు సత్యమే! గాని పూర్వ జన్మ వాసనలు హెచ్చుగా యున్నగాని బాల్యమునందు భక్తి లభించుట కష్టము. అయినను 'బలవాన్ యింద్రియ గ్రామో విద్వాంసమపికర్షతి' యింద్రియములు బలవంతములగుటచే విద్వాంసునైనను ఓడింపక మానవు. కాలము స్వల్పమైనందున అత్యుద్ఘటములైన కర్మలు చేసినను లాభములేకపోవుచున్నది. 'కర్మణా గహనా గతి' అనినట్లు కర్మములచే అరణ్యమున తిరుగుచుండుటయే గాని సూక్ష్మజ్ఞానము లభింపదు. ఈశ్వరుడు సమస్త జీవరాసులకు తల్లియు, తండ్రియు నైయున్నాడు. భక్తికి విద్యావాసన అవసరములేదు అక్షరశూన్యుడు నిర్మలమైన హృదయముతో ప్రార్థించిన భగవంతుని సాక్షాత్కారము బొందలేడా? 'వ్యాధస్యాచరణం। ధృవస్యచ వయో। విద్యా గజేంద్రస్యకా। కుబ్జాయాఃకిము, నామరూపమధికం। కింవా సుదామో ధనం। వంశః కో విదురస్య। యాదవపతే రుగ్రస్య కింపౌరుషం। భక్త్యాతుష్యతికేవలం నచగుణైః భక్తి ప్రియో మాధవః॥'

వ్యాధుని నడవడిక యెట్టిది? ధ్రువుని వయసెంత? గజేంద్రునకు వచ్చిన విద్య యెంత? కుబ్జ యెట్టి సౌందర్యవతి? సుదాముని ధనమెంత? విదురుని వంశమెద్ది? యాదవపతియైన యుగ్రసేనుని పౌరుష మెంత? వీరు అందరూ భక్తిచేతనేగదా భగవత్ప్రసాదమును బడయగల్గిరి! అట్టి భక్తిచేత బద్ధుడగు భగవంతుని గోరు ప్రతి జీవియు భక్తిసాధనములు చేయుచుండవలయును. సత్సంగము, కృష్ణసేవయు, భాగవతము, హరినామకీర్తనయు, తీర్థసేవయు భక్తికి సాధనములు. 'భక్తిస్తు భగవద్భక్త సంగేన పరిజాయతే' అన్నట్లు భగవత్ భక్తుల సహవాసమువలన భక్తి జనించును. కృష్ణసేవ అనునది తన మనస్సు కృష్ణ పదారవింద చింతనమందును, వాక్యములు వైకుంఠగుణానువర్తనమునందును, కర్ణములు అచ్యుతుని సత్ప్రసంగ శ్రవణమునందును నియమించుట. మూడవది భాగవత పఠనము. భక్తి జ్ఞాన విరాగ తత్వములతో కూడిన

శ్రీ భగవానుని చరిత్రాత్మక కథలతో తన ఆత్మ నెల్లప్పుడు శ్రీ భగవంతునియందు ఉంచుట. నాల్గవది నామకీర్తనము. నామకీర్తనము, నామజపము, నామశ్రవణము: ఇవి భక్తి నార్జించుకొనుటకు మంచి సాధనములు. నామకీర్తనలతోనే 'ప్రహ్లాద నారద పరాశర। పుండరీకా వ్యాసాంబరీష శుక శౌనక వాలఖిల్యాః॥ మొదలైనవారు భగవంతుని స్వరూపము తెలిసికొనగలిగిరి.

'హరేర్నామ హరేర్నామ। హరేర్నామైవ కేవలం। కలౌ నాస్త్యేవ నాస్త్యేవ। నాస్త్యేవ గతి రన్యథా॥' అనగా కలియుగమున హరినామస్మరణకన్న వేరొక గతిలేదు. ఒకమాటు నామోచ్చారణ చేసిన యెడల సమస్త పాపములు పోవునట. రెండవసారి నామోచ్చారణ చేసిన భగవంతుడు అక్కడనే తాండవము చేయును. భగవంతుని నామము 'గుహ్యాతి గుహ్యం శ్రీ కృష్ణ సంకీర్తనమ్' అతి గోప్యమైనది. అట్టిదానిని జపించిన, కావలసినదేమిటి? తరువాత తీర్థయాత్రలవలన, అందు మహాపురుషుల సాంగత్యమువలన, హృదయమునందు భక్తి జనించును. అదియే మొలకలెత్తును. ఆఖరుది ఆత్మనివేదన. అనగా మనోవాక్కాయములచేతను, యింద్రియములచేతను జేయు కార్యములు అన్నియు భగవంతునికి అర్పించుట. 'యత్కరోషి యదశ్నాసి। యజ్జుహోషి యదాసియత్। యత్తపస్యసి కౌంతేయ। తత్కురుష్వమదర్పణమ్॥' తాము యేకర్మ చేసినను భగవదర్పితముగా చేసినచో, నిష్కళంకులగుచున్నారు. అందుచే సంసారచక్రభ్రమణము చేయుచున్న మనము నిష్కల్మషముగా భగవంతుని భక్తిచేత వశపరచుకొని యీ సంసారబంధమునుండి యుత్తీర్ణులమగుటకు యీ సూక్ష్మధర్మము తప్ప వేరొక పరమోపాధి కనుపించదు. మ॥ తనుహృద్భాషల సఖ్యమున్। శ్రవణమున్ దాసత్వము న్వందనార్చనమున్ సేవయు నాత్మలో నెఱుకయు సంకీర్తనల్ చింతనంబను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మి సజ్జనుడై యుండుట భద్రమంచు దలతున్॥ యీ తొమ్మిదివిధములగు భక్తులలో ముఖ్యమైనది కీర్తనమే. యిందులో అనేకులు అనేకవిధముల భక్తులు జూపుచున్నారు. అన్నిటియందును భగవంతుడు వారికి కనబడుచున్నాడు. 'యేయథామాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం' అన్నట్లు యెవరు యే భక్తిచేత కీర్తించిన వారికి అటులనే కనిపించుదునని చెప్పియున్నాడు. గనుక ప్రతివారును వారి భక్త్యానుసారము శ్రీ భగవంతుని ప్రార్థించి యీ పాపసంకులమైన సంసారమునుండి బయటపడవలయును. 'కలౌ చేత్ స్మరణాన్ముక్తి' యీ కలియుగమున కీర్తనమే మహాయజ్ఞమని ఘోషించుచున్నారు. కృత త్రేత ద్వాపర యుగములయందు యజ్ఞములచేతను, యోగముచేతను పూతులైరి. గాని యీ కలియందు మనస్సు ఒక నిముషమైన నిలుపుటకు సావకాశము లేనందున ఒక్క నామస్మరణముచేతనే ఆ యజ్ఞముల ఫలమును భగవంతుని సాక్షాత్కారమును బొంది పునరావృత్తిరహితమై శ్రీ భగవంతునిలో నైక్యము పొందెదరు. గాన భగవద్భక్తులందరు తాము తరించుటయే గాక తక్కినవారిని కూడ యీ యజ్ఞమునకు సిద్ధపరచి యీ భక్తి యను నావనెక్కి యీ సంసారసముద్రమును తరింపవలయునని గోరుచున్నాను.

---

# కావ్యాలు – స్త్రీలు

శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు



'విశ్వశ్రేయః కావ్యం' అనే లాక్షణికుల అనుశాసనం మన ప్రాచీనమహర్షుల ఆదికావ్యాల మహత్తును చాటుతూంది. అందుకనే మనపెద్దలు 'వేదాలు ప్రభువువలె శాసిస్తాయనీ, పురాణాలు మిత్రునివలె పరామర్శిస్తాయనీ, కావ్యాలు కాంతలవలె ఉపదేశిస్తాయనీ' నమ్మి కావ్యాలకు ప్రాముఖ్యాన్నిచ్చారు. పనిబెట్టుకొని పట్టీరానే ఓపికఉండే పెద్దలు కావ్యమంటే దానికి ఆరు లక్షణా లుండాలన్నారు. కాని ఎందుచేతనో ఆకాలపు ప్రసిద్ధులైన కవులే తరువాతివాండ్లకు మార్గదర్శకులై శృంగారమనే పేరుతో అసభ్యాలూ అవాచ్యాలు వ్రాసి నవరసాల్లో దాన్ని నాయకరసాన్ని చేశారు. శృంగారరసమంటే కచకుచ వర్ణన మనుకొని తరువాతి స్త్రీలు పురుషులు తమ గ్రంథాలలో ఈ వెఱ్ఱి శృంగారాన్ని నింపి చివరకు 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనే స్థితిలోకి తీసుకొనివచ్చారు. ఇది ఇట్లా కావడానికి కారణాలు చాలాఉన్నాయి. ఒకడు సహజంగా కాముకుడై తన గ్రంథమంతటా బూతులు నింపుతాడు. మఱొకడు తనకిష్టములేకున్నా తనరాజు కిష్టమని పచ్చిపచ్చిగా వ్రాస్తాడు. వేఱొకడు అట్లా వ్రాయడమే ప్రబంధలక్షణ మేమో అనుకొని రోతలు కూరుస్తాడు. ఇట్లే రానురాను మన ప్రబంధాలు కావ్యాలు దుర్నీతికీ దోషాలకీ స్థానాలయినాయి. అదేమంటే మా కవిత్వంలో అంతరార్థ మందనో నీతిని మాత్రమే గ్రహించరాదా అనో అంటారు ఇప్పటి రచయితలు. మరుగుదొడ్డిలో మరువము మొలక ఉన్నట్లు గ్రంథమంతటా రోతలుండి ఏ ఒక నీతిపద్యమో ఉంటే అది మనస్సుకెక్కుతుందా? ఈ కావ్యాలు విరక్తులైన జ్ఞానుల కొరకు వ్రాయబడేవికావు. ఇంక ఉద్దేశింపబడిన సామాన్యులనూ అపమార్గాన్ని బట్టిస్తాయి. ఇది శృంగారరోగ పరిణామమూ ఫలితము. ఈ రోగము పూర్వులకే గదా అనుకుంటే సాంక్రామికవ్యాధివలె ఇప్పటివారికికూడా తగిలింది. దీన్ని రసికత అంటారు కొందరు ఉన్మత్తులు.

రచనలు ఆయాకాలపు వ్యక్తుల మనస్తత్వాలను బట్టి రచింపబడుతూంటాయి. ప్రబంధాలకు ముఖ్యులైన నాయికా నాయకులను తమ కాముకభావాలకు అనుగుణ్యంగా సృష్టించి ఎన్నో అభాసలు చేసినారు. సామాన్యంగా స్త్రీని తమ యింటిలోని సామానుగా జూస్తూ స్త్రీ అంటే కామ నివారక యంత్రమనే భావించేవారాకాలపు పురుషులు. ప్రాచీన మహర్షులు స్త్రీకి మాతృపదవి నిచ్చి గౌరవించినా తరువాతివాళ్లెందుచేతనో స్త్రీని లాలసబుద్ధితో చూస్తూ వచ్చినారు. అందుకే స్త్రీని శృంగార రసాధిదేవతనుగా చేసికొని తందనాలాడారు. వారి గ్రంథాలను చూస్తే ఆమెను వారెట్లా చూచేవారో తెలుస్తుంది. 'పతి చెడ్డ ప్రవర్తనముగలవాడైనా స్త్రీ అతని అడుగులకు మడుగు లొత్తాలనీ, ఆమె యెప్పుడో ఒకసారి తప్పుచేస్తే భర్త ఆమె తల పగులగొట్టాలనీ' తలచేవా రామహానుభావులు. స్త్రీలు దుర్బలులు మృదుస్వభావలూ అనీ, వారు పురుషుల ఆశ్రయంలో ఉండదగిన వారనీ, నేను ఒప్పుకొంటాను. పురుషుల సత్ప్రవర్తనకంటె స్త్రీల సతీత్వము ఎక్కువగా ఉండాలని నాకు తెలుసు. కాని స్త్రీకి ఒక స్వతంత్రమైన అస్తిత్వము ఉంది. అందులో విశేషించి మన భారతదేశ స్త్రీకి. ఎందుకంటే ఇక్కడ ఎందరో రమణీమణులు ఉపనిషత్తులు వ్రాశారు, రాజ్యాలేలినారు, యుద్ధాలు చేసినారు. మనము స్త్రీజాతిని గృహోపకరణాలలో చేర్పలేము. అనేక విషయాల్లో పురుషునికంటె స్త్రీ యెక్కువ. శారీరక బలంలో మానసికోద్యమంలో స్త్రీ పురుషునికంటె తక్కువ కావచ్చును. కాని సేవ, ఓర్పు, ధర్మానురాగము, స్నేహము, స్వార్థత్యాగము, సుశీలత్వము - వీటిలో స్త్రీ పురుషునికంటె చాలగొప్పది. కాదా? కాని మధ్యకాలపు వాళ్లు స్త్రీని తమ కవితాచమత్కృతిపేర రచ్చకెక్కించారు.

నాగరకతాభివృద్ధి యైనకొద్దీ స్త్రీజాతిని పురుషజాతి యెక్కువ గౌరవింపసాగింది. క్రమక్రమంగా పురుషుల్లో ఉన్నతభావాలు కలుగుతూ ఉండడమే దీనికి కారణము. నాగరికజాతి తన పిడికిటిలోకి వచ్చిన శత్రువును దయతో చూస్తూంటే గృహలక్ష్మి, ఆపత్సహాయినీ, అర్ధాంగి అయిన ధర్మపత్ని తన పిడికిటిలో ఉందని పురుషుఁడామెను దయతో జూడలేడా? స్త్రీని గౌరవించుటచేతనే ఆయా జాతుల నాగరీకత నిర్ణయింపబడుతూందని విద్వాంసులు అభిప్రాయపడుతున్నారు. ఆర్యజాతి ఒకప్పుడు స్త్రీజాతిని ఎంతో గౌరవించింది. నాగరకులమనుకొనే ఇంగ్లీషువారు కూడా యింతకుమించి పోలేకపోయిరి. యింక పోలేరు. ఏ భారతీయుని హృదయంలో 'స్త్రీ విషయమై తన కర్తవ్యాన్ని పాలించినా పాలింపకపోయినా తప్పులేదు' అనే భావం పుట్టుతుందో ఆదినమే ఈ జాతికి దుర్దినము. ఇప్పటి నవ్యకవులు కొందఱు ఈ విషయాన్ని గ్రహించి ఉత్కృష్ట కావ్యాలు రచించి లోకానికి పవిత్రప్రేమ స్వరూపాన్ని తెలియబరిచారు. పూర్వం కూడ ఇట్లాంటి రచనలే సాగి ప్రబోధం కలిగించిఉంటే మన మీస్థితిలో ఉండియుండము. ఈ శృంగార కావ్యాలు మనలను సోమరిపోతులను జేశాయి. పూర్వులు శృంగారానికే స్థానమిచ్చినా యిప్పటివారు దాన్ని శుద్ధముగా చేయుడమో వదలడమో చేయాలి. పామరుల పాడుచేసే అసభ్యగీతాలు మానివేయాలి. మన పూర్వకవులు చేసిన శృంగారరసాభాసలు ఇంకొకసారి మనవిచేసుకొంటాను, వీలుంటే.

---

## నిశలకావల

నీలి మబ్బుల
నిశలకావల
నవ్య తారలు
వెలుగుచున్నవి
చూడలేవా పాంథుడా?

కారుచీకటి
కరగిపోగా
ఏ తార హృ
దంతరమ్మోశ
లేత వెలుగుల
విరియు నేమో

త్రుప్పు పట్టిన
హృదయ తంత్రులు
తేనె లొలికెడి
పాట లల్లగ

గాలిలో తారాడు
నలతే
తీయనౌ రా
గాల నూదగ
పూతమై నీ
జీవితంబే

పావనంబై
విశ్వ కల్యా
ణంపు ప్రారం
భములనే సూ
చింతువేమో

నీలి మబ్బుల
నిశలకావల
నవ్య తారలు
వెలుగుచున్నవి
చూడలేవా పాంథుడా?

—అనిశెట్టి సుబ్బారావు.

# కాశ్మీర యాత్ర 



శ్రీమతి వంగల
వాణీబాయిగారు

(గతసంచిక తరువాయి)

ప్రేమలత: ఒదినోయి! కమల అప్పుడే వచ్చేసింది. నేను అల్లుతూఉన్న టేబిల్ గుడ్డ కూడ పూర్తి అయింది. ఇంక నీదే ఆలస్యం. అబ్బ! ఇంక మరిపించక ఆ "గృహలక్ష్మి" మడిచేసి, నిన్న నీ కాశ్మీర యాత్ర మిగతా అనుభవాలు పూర్తిచెయ్యి. మీ చిన్నపాపాయికి చిన్నిమేజోళ్లు అల్లి లంచం ఇచ్చుకొంటానులే!

సరళ: ఊం! సరే, నిన్న ఎందాకా వచ్చాం? ఆ, శ్రీనగరూ, ఆ చుట్టుప్రక్కల ప్రదేశాలూ చెప్పేశా. ఇంక గుల్‌మర్గ దగ్గరనుంచీ మొదలుపెట్టాలి. జూన్ నెలనుండి సూర్యరశ్మి చాల జాస్తిగా ఉండడంవల్ల, అక్కడివారందరూ గుల్‌మర్గ, ఫాల్‌గాం, సోన్‌మర్గ మొదలైన ఊళ్లకు, చల్లదనానికి, శ్రీ నగరాన్నుండి వెళ్లిపోతారు. మేముకూడ గుల్‌మర్గకి వెళ్లిపోయాం. అది ఒక పీఠభూమి—సుమారు 1,500 అడుగుల ఎత్తు. చుట్టూ ఖిల్లిన్‌మర్గ, లూడరుమర్గ మొదలైన అనేక కొండలు కలిగి ఎంతో రమ్యంగా ఉంటుంది. పూర్వం దీన్ని గౌరీమర్గ అనేవారట. కాని దొరలు వచ్చి దీనిపేరుమార్చి గుల్‌మర్గ అని పిలుస్తున్నారు. ఇది చాల ఆరోగ్యవంతమైన ప్రదేశమని అనేకులు ఇచ్చటికి వస్తూఉంటారు. గుల్‌మర్గ "గోల్ఫ్‌గ్రౌండ్స్" (Golf grounds) ప్రపంచమంతటిలోనూ ఉత్తమమైనవి అని అంటారు. అందుచేత ఇచ్చటకు యూరోపియన్లు చాలామంది వస్తూఉంటారు. ఇచ్చట ఇండ్లన్నీ కొయ్యతోనే కట్టబడినవి. జూన్, జూలై నెలలలో అద్దెలు చాల ఎక్కువగా ఉంటాయి. ఇచ్చటనుండి ఎక్కడకు వెళ్లాలన్నా గుర్రాలమీదనే పోవాలి. ఆ గుర్రాలు చాల సాధువైన జంతువులు. క్రొత్తవారినికూడ అతి జాగ్రతతో కొండలమీదకు తీసుకవెళ్లి పడిపోకుండా తీసుకువస్తాయి. గుల్‌మర్గలో చలికాలంలో ఎప్పుడూ మంచు కురుస్తూనేఉంటుందిట. ఇండ్లన్నీ మంచుతో కప్పబడి ఉంటాయి. ఇక్కడ మనుష్యులు 'మే' నెల మొదలు అక్టోబరు నెలవరకూ మాత్రమే ఉండగలరు. ఇచ్చట నివసించేవాళ్లుకూడా చలి నెలలలో "టాంగ్‌మర్గ" మొదలైన ఊళ్లకు వెళ్లిపోతారు. గుల్‌మర్గలోఉన్న రోజుల్లో క్రొత్తగా చూచుటకు వెళ్లినవాళ్లు ఆ చుట్టుప్రక్కల స్థలములు చూడటానికి ఉదయంవెళ్లి, సాయంకాలం తిరిగి వచ్చేస్తారు. ఎక్కడికివెళ్లినా, మేంకూడ గుర్రములమీదనే బయలుదేరేవాళ్లం. చాలా సరదాగా ఉండేది. ఒక ఉదయం బయుద్దేరి "కిలిన్‌మర్గ"కు వెళ్లి ఒకదినమంతా హాయిగా అక్కడే కాలంగడిపి సాయంకాలం ఇంటికి వచ్చాం. మరొకనాడు "ఆల్‌పత్తర్" అనే చోటుకు వెళ్లాం. అక్కడికి వెళ్లేదారిలో రెండుకొండలమధ్య ఒక పెద్దగుంట ఉంది. ఆ గుంటలో ఎల్లప్పుడు నీరు గడ్డకట్టుకునే ఉంటుంది. నడివేసంగిలోకూడ అది అట్లాగే ఉంటుందని అక్కడివాళ్లు చెప్పారు. అక్కడనుంచి ఇంకా బాగా పైకి ఎక్కితే "అఫర్వత్" అనేకొండ వస్తుంది. ఇది 14,500 అడుగుల ఎత్తు ఉంది. అక్కడనుంచి కొంచెం ఎత్తుపల్లాలదారినుండి వెళ్తే, రెండుకొండలమధ్య ఒక చక్కని పచ్చికబయలు కనబడుతుంది. అక్కడే రెండు చిన్నచెరువులు ఉన్నాయి. ఈ చెరువులు రెండూ స్ఫటికాలమాదిరి ధగధగలాడుతూ నిర్మలంగా ఉన్నాయి. అందుచేతనే వీటిని స్ఫటికజలసరస్సులు (Crystal water lakes) అని

అంటారు. వీటిలో నీరు చాల చల్లగాఉండి చుట్టుప్రక్కలఉన్న శృంగారమైన దృశ్యాలన్నీ ఆ నీటిలో ప్రతిబింబించుతూ ఉంటాయి. ఈ జాగానే "ఆల్‌పత్తర్" అంటారు. గుల్‌మర్గుకి మరియొకప్రక్క "తోష్‌మైదాన్" అని ఉంది. ఇక్కడ కొన్ని పూర్వకాలపు దేవుడిగుళ్ల శిథిలాలు మాత్రం (సికిందర్‌షా కాలములో పాడుచేయబడినవి) ఉన్నాయి.

ఈ విధముగా గుల్‌మర్గ చుట్టుప్రక్క ప్రదేశములు చూస్తూ సుమారు 10 దినాలు గడిపి మేం మళ్లీ శ్రీనగరానికివెళ్లి ఒక గృహనావ (House Boat) కుదుర్చుకొని జీలంనదిమీద వూలారు సరస్సుకు బయలుదేరేం. దారిలో ఖీర్‌భవానీ అనేచోట ఆగేం. ఇది అక్కడి హిందువులకు యాత్రస్థలం. ఇచ్చట ఒకచిన్న కోనేటిమధ్య ఒక అమ్మవారి మందిరం ఉంది. ఆ గుడిప్రక్కనే (కోనేటిలోనే) ఒక "ఫౌంటెన్" ఉంది. అందులో నీరు దానంతట అదే అనేకరంగుల్లోకి మారుతూ ఉంటుంది. నలుపురంగు గనక ఎప్పుడైనా వచ్చిందంటే, ఆ ప్రదేశమందు ఏదో ఒక గొప్పవిపత్తు రానున్నదని సూచన అంటారు. అలైనప్పుడు బిందెల కొలది క్షీరాన్నము (ఖీర్) చేయించి ఆ దేవికి అర్పిస్తారు. అందుకే ఆ దేవతపేరు "ఖీర్‌భవానీ" అంటారు. కాశ్మీరు మహారాజుకూడా అప్పుడప్పుడు ఖీర్‌భవానీని దర్శించి వెళ్తూ ఉంటారు.

ఇక్కడనుంచి మళ్లీ మా 'నావ'లో బయల్దేరేం. వూలారు సరస్సుని, జీలంనదినీ కలుపుతూ ఒక కాలువఉంది. దానిని 'నూరు' కాలువ అంటారు. ఆ కాలువగుండా వూలారు సరస్సు ప్రవేశించాం. ఈ సరస్సు హిందూదేశమంతటిలోనూ పెద్దది (Largest lake in India). ఈ సరస్సుచుట్టూ చిన్న చిన్న పల్లెలు ఉన్నవి. ఈ సరస్సులో ఒకటి, రెండు, లంకలుకూడ ఉన్నవి. ఈ లంకలమీద పల్లెవాండ్లు గుడిశలువేసుకొని కాపురాలు చేస్తారు. 'హరిముఖ పర్వతశిఖరము' ఈ సరస్సులో ప్రతిబింబించుతూ ఉంటుంది. ఈ సరస్సులో బోటువేసుకుతిరుగుట ప్రమాదకరమని అక్కడివాళ్లు చెప్పారు. ఇది చాలా లోతుగా, మొసళ్లు మొదలైన భయంకర జలచరములతో నిండియున్నది. ఒక్కొక్కప్పుడు అకస్మాత్తుగానే చుట్టూఉన్న కొండలమీదనుంచి పెద్దగాలి వచ్చి, ఈ నీటిని అల్లకల్లోలంచేసి 'నావల'ను ముంచివేస్తుందట. ఈ చెరువులో చాల ప్రసిద్ధిచెందిన 'చేపలు' దొరుకుతాయి. ఈ చేపలు ఎండబెట్టి ఎగుమతిచేస్తారు. ఇక్కడ నుంచీ మేం, మళ్లీ శ్రీనగరానికి వచ్చేశాం. ఈ సరస్సు చూడటానికి వెళ్లిన అయిదు దినాలూ గృహనావ లోనే, వంటలూ, భోజనాలూ, పడకలూకూడా!

ప్రేమ: అయితే, వదినా, శ్రీనగరం వచ్చేసేక మరేమీ వింతలు చూడలేదూ?

సరళ: చూడకేం, శ్రీనగరునుంచి ఈసారి 'అమర్‌నాథు' యాత్రకు బయలుదేరాం. ముందు తిన్నగా 'ఫాల్‌గాం'కి కారుమీద వెళ్లేం. దారి పొడవునా పెద్ద పెద్ద 'వాలునటు చెట్లు' (Walnut trees) ఉన్నాయి. ఈ కర్రతో చాల మంచి కొయ్యసామాన్లు (Furniture) చేస్తారు. దారిలో కొన్ని రాగి గనులు కూడ ఉన్నాయి. ఫాల్‌గాం కూడ వేసంగి వసతే. ఇది 7,200 అడుగులఎత్తు. ఈ ఊరికి ఇరుప్రక్కలనూ రెండు సెలయేళ్లు ఉన్నాయి. ఎత్తైన పెద్ద మంచుకొండలూ, కొన్ని చిన్నకొండలూ, పచ్చని చెట్లపరసలతో ఎంతో మనోహరంగా ఉంటాయి. ఇక్కడ ఉండటానికి ఇండ్లుగాని, గుడారములుగాని అద్దెకు తీసుకో

వచ్చు. ఇవిగాక ఒక యురోపియన్ హోటెలు, ఒక హిందూహోటెలు కూడ ఉన్నాయి. మేం శ్రీనగరా న్నుంచే ఒకపెద్ద (Tent) గుడారం అద్దెకు పుచ్చుకు వెళ్లేం.

అది తీసి ఎక్కడ కావాలంటే అక్కడ వేయించుకోవచ్చు. అమర్‌నాథుకు వెళ్లేముందు మేం, ఇక్కడ ఆరురోజులు ఆగేం. ఇక్కడ నుండి ఒకనాడు 'కొల్హాయి గ్లేసియరు' (మంచుకొండ) చూడటానికి వెళ్లాం. ఇది 9000 అడుగుల ఎత్తు.

ఫాల్‌గాంలో అమర్‌నాథుయాత్రకు అవసరమైన వస్తువులన్నీ కొనుక్కొని, మంచి గుర్రములను కుదుర్చుకొని బయలుదేరాం. మాతో వెచ్చని ఉన్నిబట్టలు, కంబళ్లు, దారిలో వండుకునేందుకు సామాన్లు, కొన్ని నిలవఉండే తినుపదార్థాలు, లాంతర్లు, కొన్ని ఔషధములు, గొడుగులూ, గుడారములు, ఇద్దరు నౌకర్లనూ కూడ తీసుకువెళ్లాం. మా సామాన్లను మోయుటకు కంచరిగాడిదలను కుదిర్చాం. దారి పొడుగునా చిన్న చిన్న యాత్రస్థలాలు ఉన్నాయి. ఎక్కడ చీకటిపడితే అక్కడే ఆగి, గుడారాలు వేసుకొని ఉండి, తెల్లవారగానే మళ్లీలేచి బయలుదేరేవాళ్లం. ప్రయాణమంతా గుర్రాలమీదే!

ముందు చందన్‌వాడీ చేరేం. ఇది 9,500 అడుగులఎత్తు. ఇక్కడ ఒక చిన్న ప్రవాహముమీద పూర్తిగా మంచుతోకట్టబడిన మంచువంతెన (Snow Bridge) ఉంది. చందన్‌వాడీనుంచి 'శేష్‌నాగ్ సరస్సు' దగ్గరకు వెళ్లేం. ఇక్కడకు అతి ప్రయాసతో చేరేం. ఇక్కడనుండి కనిపించే ప్రకృతిదృశ్యం వర్ణనాతీతం. మరి ఎక్కడా ఈమాదిరి దృశ్యం లేదనియే చెప్పవచ్చు. కాని 'స్విట్జరులేండు' మనోహర దృశ్యాలు, కొంతమట్టుకు మనోవీధిలో గోచరించక తప్పవు. ఈ సరస్సు చుట్టూ ఉన్న మంచుకొండలు ఆ నీటిలో వెండివలె మెరుస్తూ ఉంటాయి. కొందరు యాత్రికులు అందులో స్నానం చేస్తారు. కాని ఆ నీటి నుండి బైటకు వచ్చేసరికి బిగుసుకుపోయినట్లవుతారు. ఆ నీళ్లు అంత చల్లగా ఉంటాయి. జూన్‌నెలవరకు ఈ సరస్సు గడ్డకట్టుకునే ఉంటుంది. అక్కడనుండి వాయుజన్ వెళ్లినాము. ఇది వట్టి ఖాళీ మైదానమే తప్ప చెప్పదగినదేమీ లేదు. ఇక్కడనుంచి పంచతరణి చేరుకున్నాం. ఇది 14,000 అడుగులఎత్తు. ఇక్కడనుండి 'అమర్‌నాథు' కొండ కనబడుతుంది. ఇక్కడ అయిదు సెలఏళ్లు ఉన్నాయి. అందుకే పంచతరణి అంటారు. ఈ అయిదు ప్రవాహాలు కొంతదూరంలో 'రామగంగా' అనే నదిని కలసి, 'సింధు' నదిలో ఐక్యమవుతాయి. ఇక్కడి ప్రకృతిదృశ్య మనోహరత, మీరే ఊహించుకోవాలి గాని, వర్ణించడం నా శక్యంగాదు! పంచ తరణిలో ఒకరాత్రి అమితచలిలో గడిపేం. ఇక్కడనుండి 'అమర్‌నాథు'కి రెండు దార్లు ఉన్నాయి. మొదటి దారిలో ఎత్తు పల్లాలు ఎక్కుటూ, దిగుటూ, చిన్న చిన్న ప్రవాహములు దాటుట, మొదలైన అంతరాయములు ఉన్నాయి. రెండవ దారిలో 14,000 అడుగుల ఎత్తునుండి 2,000 అడుగులు క్రిందకు దిగి, మళ్లీ 13,500 ఎత్తుకు ఎక్కి, అక్కడ 'అమరావతి' అనే చిన్న ఏరుదాటి, వెళ్లాలి. అప్పుడు 'అమర్‌నాథు' గుహ చేరుతారు. మేం రెండవ దారినే వెళ్లేం. ఆ గుహ చూచేసరికి మా అలసట అంతా పోయినట్లైంది. ఈ గుహ షుమారు ఏబది అడుగుల పొడవు, వెడల్పు, ఎత్తూకూడ కలిగి, దక్షిణముఖంగా ఉంది. ఇది శిలాజిత్తుతో (gypsum) తో చేయబడ్డది. ఇందు మూడు లింగములు మంచువి ఉన్నాయి. ఒకటి పెద్దదిగాను, మరియొకటి మధ్యరకంగానూ, ఇంకొకటి చిన్నదిగానూ ఉన్నాయి. ఇవి శివుడు, పార్వతి, వినాయకుడు అని చెప్తారు.

ఈ మూడు లింగాలూ పౌర్ణమికి నిండు సైజుకి వస్తాయి. అమావాస్యకు పూర్తిగా కరిగిపోయి ఉంటాయి! మధ్యదినములలో ఆ తిథినిబట్టి కొంచెం కొంచెం పెరుగుతూ ఉంటాయి. అనేకమంది వైజ్ఞానికులు ఈ లింగములు ఇట్లు పెరగుటకు, తరుగుటకు కారణం తెలుసుకోవాలని తలకాయలు బ్రద్దలుకొట్టుకొన్నారు. కాని ఇంతవరకూ దీని మహత్యం అందరికీ అగమ్యగోచరంగానే ఉంది! ఇంతేకాక, ఈ గుహాలో రెండు మూడు రకముల కాకులు, పావురములు, పిచ్చుకలూ ఉన్నాయి. ఇవి బయట ఎక్కడా కనబడవు. ఇవి అక్కడికి ఎట్లా వచ్చాయో, ఆ అమిత చలిలో ఎట్లా బ్రతుకుతున్నాయో ఆ శివునికే ఎరుక! ఈ పావురములనూ, పిచ్చుకలనూచూస్తేనేగాని, యాత్ర ఫలితంగాదని యాత్రీకులు అవి కనబడేవరకూ కూర్చుంటారు. పూర్వకాలం దేవతలు శివునివద్దకు వెళ్లి, తమకు చావులేకుండునట్లు వరము కోరగా, శివుడు తన 'జటలను' తన పిడికిటితో గట్టిగా పిండితే నీరు రాలినట్లూ, ఆ నీరే అమరావతినది అయినట్లూ, అందులో ఒక్క బొట్టుమాత్రం ఈ గుహాగా మారినట్లూ, అచ్చట శివుడే లింగరూపము దాల్చినట్లూ, దేవతలు అమరావతినదిలో స్నానముచేసి గుహాలో శివుని దర్శించుకొని చిరంజీవులైరనీ, పూర్వపుగాథ చెప్తారు.

ఇచ్చట భగవంతునికి వారివారి శక్తికి తగినట్లు నివేదన లర్పించి, వెంటనే పంచతరణికి తిరోన్ముఖులవుతారు. అమర్‌నాథుగుహవద్ద మాత్రం ఎవరూ రాత్రిసమయంలో గడపలేరట. ఒకవేళ మొండికేసి ఎవడైనా అక్కడ ఒకరాత్రి గడపెనా, ఉదయానికి భస్మమైయుంటాడని నమ్మకం.

తిరిగి వచ్చినదారినే, బయలుదేరిన వారంరోజులకు, ఫాల్‌గాం చేరాం. అసలు అమర్‌నాథు యాత్రసమయం, శ్రావణమాసం (August). అప్పుడు చాలమంది యాత్రీకులు వెళ్తారు.

మూడుమాసాలూ ఇట్లా గడపి, మా సెలవలాఖరికి తిరిగి శ్రీనగర్‌నుండి కారుమీద తిన్నగా లాహోరు చేరేం. లాహోరు అమృతసరులలో నాలుగుదినాలు గడపి, మాఊరు చేరుకున్నాం.

కమల: సరళా, మా అమ్మమ్మ చెప్పే కాశీ, రామేశ్వరాల యాత్రలకంటే, నీ అమర్‌నాథు యాత్రే చాలా బాగుంది. నీ కాశ్మీరుయాత్రవల్ల ఆనందం, జ్ఞానం, పుణ్యం అన్నీ ఒకేమాటు ఆర్జించావన్నమాట. పూర్వం మన ఆడవాళ్లు వంటయిల్లు కదలి బయటకు వెళ్లడం మహాభాగ్యంగా ఉండేది. అందుచేత ఈ యాత్రలపేరుచెప్పి పై పట్టణాలు చూడమని పెద్దలు పుణ్యక్షేత్రాల్ని నిర్మించారు. ప్రస్తుతం నాగరికత ప్రబలుతున్నది కాబట్టి, నేటి మన సోదరీమణులను పుణ్యక్షేత్రాల పట్టికలో కాశ్మీరుయాత్రకూడ కలపమని ప్రార్థించుతాను. దీనివల్ల రక్తి, భక్తి, ముక్తి అన్నీ లభించుతాయి.

సరళ: అన్నట్లు చెప్పటం మరచేను—ఈ కాశ్మీరుయాత్ర మరపురాకుండా, మా హృదయాలను ఆనందడోలికలలో ఎప్పుడూ ఊఁచేటందుకు, మా పిల్లవాడికి అమర్‌నాథు అని పేరు పెట్టేం!

ఇంకోసారి మా బదరీనాథు యాత్రకూడ వినిపిస్తానులే!

---

# గృహలక్ష్మి

శ్రీమతి చుండూరి రమాదేవిగారు

కుటుంబమున కధిదేవత స్త్రీ. గృహమున కలంకారము గృహలక్ష్మి. గృహిణిలేని గృహము స్మశానమువలె, శోభా విహీనమై, కళకాంతులులేక చూడరానిదిగ నుండును. పురుషుడు యెంత ధనార్జన పరుడైనను, దినమెల్ల చెమటకోర్చి, శ్రమపడి, గృహమునకేతెంచునపుడు మృదుమధుర మంజులాలాపములతో శ్రమబాపి, సుఖమొనగూర్చు యిల్లాలులేనిదే శాంతిలేదు. ఈ ప్రపంచములో మానవుడు నిర్విచారముగా ననుభవింపకలిగిన పవిత్రానంద మొక్క కుటుంబానందమే.

స్త్రీ ప్రేమస్వరూపిణి. కోమలహృదయిని. గృహదేవత. గృహమును స్వర్గతుల్యముగ చేయునది ఆ దేవీమూర్తియే. సంసార చక్రమును నిర్విచారముగా త్రిప్పకలిగినది స్త్రీ మూర్తియే. పూర్వకాలమున స్త్రీ లెంతయో గౌరవముగ చూడబడిరి. ఆర్జన పురుషునిది. శాసించుట స్త్రీది. ఎవరిని యేవిధముగ ఆదరింపవలయునో ఆమెకు బాగుగా తెలియును. గృహమున కీర్త్యపకీర్తులు స్త్రీ పైననే ఆధారపడియుండును.

సంసార శకటమునకు స్త్రీ పురుషు లిరువురు రెండు చక్రములవంటివారు. ఇందులో యే చక్ర మాగినను, బండి సరిగా నడువజాలదు. అందువలన దంపతులకు అన్యోన్య మవసరము. సంసారరంగమున పురుషునికన్న స్త్రీకే యెక్కువ బాధ్యతయని చెప్పవలయును. అన్యోన్యానురాగము గల సంసారము యెట్టి ఒడుదుడుకులు లేక ప్రశాంతమై గడచును.

స్త్రీ గృహలక్ష్మి, తల్లి, భార్య, సోదరి. స్త్రీ జీవితమునకు పట్టుకొమ్మ. మాతృదేవతయై తన సంతానమునకు జ్ఞానాభివృద్ధిని కలిగించును. సోదరియై, విశ్వసౌభ్రాతృత్వమును బోధించును. భార్యయై మానవుని జీవితమును స్వర్గతుల్యముగ నొనరించును. గృహలక్ష్మికి, శాంతము, సత్యము, తృప్తి, నిరాడంబర జీవితము—ఇవి ప్రధాన భూషణములు.

ఇట్టి గృహలక్ష్మిని అనాదరణచేసి వ్యక్తిత్వములేని యంత్రముగా భావింపక, తగు గౌరవమొసంగుట పురుషుల కర్తవ్యము. స్త్రీలు తాముచేయవలసిన ధర్మమెఱుంగక, స్వాతంత్ర్యము, విడాకుల చట్టములు కావలయునని వేదికలెక్కి యుపన్యాసము లిచ్చినంతమాత్రమున గౌరవము రాదు. ఇంటగెలిచి రచ్చగెలువ మనినట్లు తన గృహమును చక్కదిద్దుకొనజాలిన, దేశమును దిద్దినట్లే.

స్త్రీలు చేయవలసిన ధర్మములు చాల గలవు. స్త్రీ తన కుమారులకు దేశభక్తి, దైవభక్తి, కార్యశూరత మొదలగునవి వుగ్గుపాలతో నేర్పి శూరశిఖామణులుగ చేయవలెను. తన కుమార్తెలను సాధ్వీరత్నములుగ చేయువలెను. అతిథి అభ్యాగతుల పూజ, భర్తృసేవ మొదలగునవి స్త్రీలు చేయవలసినవి యెన్నియోగలవు.

స్త్రీ గృహమునకు నిరంకుశాధికారిణి. ఆ గౌరవము వనితలు దక్కించుకొనవలెను. పురుషులకు తోడునీడగా స్త్రీలు సంచరించుటయే ధర్మము. పూర్వమునను గృహము మొదలు రణరంగమువఱకు భర్తలకు సహాయముచేసినవారెందరో గలరు. కాని, పురుషులను గాదనినవారెవరునులేరు.

భర్త కనుకూలవతియై, తన సతీధర్మమును నిర్వర్తించుకొనుచూ గృహపాలన చేయునపుడే స్త్రీకి గౌరవము. 'కార్యేషు దాసీ కరణేషు మంత్రీ' అను నార్యోక్తిని మెలగవలయును. సంసారమున స్త్రీ పురుషు లిరువురు సమానులు. కాని, అందుగల బాధ్యతలు వేరు. యే సమయమున ఏ విషయములో సమాన బాధ్యత వహింపవలయునో గృహలక్ష్మి గుర్తెఱింగిన, యెట్టి వైపరీత్యము గలుగదు. పతి యెట్టివాడైననూ పతితో నేకీభవించి సంసారశకటమును నడుపు సతియే యిహపరములయందు సుఖింపగలదు. కావున సోదరీమణు లెల్లరును నిగర్వ చూడామణులై గృహపాలన విషయమున నిరసన మాని, తీరిక వేళలందు రాట్నపరిశ్రమ యొనర్చుచు - మోయలేని బరువులకై పరువులెత్తక - వినయశీలలై తనరారునాడు భారతదేశ సౌభాగ్యాభివృద్ధి కన్నులపండువగా నుండును. గృహలక్ష్ము లెల్లరు తమ విధ్యుక్త ధర్మముల నేమరకుందురుగాక.

# ఓ అమ్మాయీ!

లోకంబంతా చీకటి ఐతే
జ్ఞానజ్యోతిని ఎత్తి చూపి
అంధాకారము బాపగలేవా?
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

★

అంగనలంతా వెనుకబడుంటే
పొంగిపొరలే ఉత్సాహముతో
రంగములోనికి పిలువగలేవా?
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

★

సాంఘిక నైతిక స్వాతంత్ర్యముకై
సత్య ధర్మములు సాధించుటకై
అమ్మాయీలను పిలువగలేవా?
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

★

వెనుక గతించిన వీరాంగనల
వీరచరిత్రము విజయచరిత్రము
పాడగలేవా? నేడు ధీరతను;
అమ్మాయీ-ఓ అమ్మాయీ!

★

ముసుగులువేసుక మూలను కూర్చొనె
అమ్మాయిల దరి నెమ్మది చేరి
పాతపద్ధతులు పారదోలుమో
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

★

రాజకీయరంగములో దిగి, స్వా
రాజ్యముకొరకై పోరెడు వనితల
వీరచరిత్రమె గానము చేయుము
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

★

సత్యముగా ఒక స్వతంత్రజీవిని
నేనే యంచును పూనికతోడ
పురుషస్వార్థులకు బుద్ధిచెప్పుమో
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

★

నే విద్యలను నేర్వన్‌గల నను;
నే నుద్యోగము చేయన్‌గల నను;
నేను సమరమున నిలువన్‌గల నను
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

★

పిల్లల గనెడి యంత్రము కానను;
పరులను గొల్చెడి బానిస కానను
స్వతంత్రజీవిని నేనే యనుమో
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

★

ఒల్లని పురుషుని వరించనంటే
ధనాశచే వృద్ధధవునికిచ్చే
అమ్మ బాబులను అతిక్రమించుము
అమ్మాయీ ఓ-అమ్మాయీ!

★

విద్యాబుద్ధులు చక్కగ నేర్చి
విజ్ఞానంబును పర్చిపూర్చి
సాటివనితలకు బాటజూపుమో
అమ్మాయీ-ఓ-అమ్మాయీ!

—శిల్లా రాజులు రెడ్డి.



ముఖము కళంకరాహిత్యమై పుష్పదళ మృదుత్వము గలిగి యుండిన, పట్టుచీరలు, ఆభరణములు స్త్రీయొక్క సౌందర్యమును పెంపొందించును.

# సౌందర్యపు మొదటి మెట్టు

దేవతాప్రతిమనుబోలు ముద్దులొలుకు ముఖముగల స్త్రీయే మిక్కిలి ధన్యురాలు. ప్రతిమపు ముఖమును చెక్కుటలో తీసుకొను శ్రమకన్న ముఖ్యమైనది స్త్రీ తన ముఖమును మృదుపరచి నిష్కళంకముగా చేయునదియే. మనోహరమగు అనేక సన్నాహముల కూడికయే ముఖవర్ఛస్సుకు కారణము. ఈ ముఖకాంతికి తగు శ్రద్ధ పుచ్చుకొనుటే సౌందర్యమునకు మొదటి మెట్టు.

ఈ స్వల్ప సహాయముతో మీరు చక్కని ముఖకాంతిని పొందగలరు. మీ ముఖముయొక్క చర్మరంధ్రములలో చేరిన నూనెను, మురికిని, ప్రతిదినము తీయుటయే మీరు మొదలు చేయవలసిన పని. మామూలుగా సబ్బుతో ముఖము కడుగుటమాత్రమే చాలదు. ఇందుకుగాను పాండ్స్ కోల్డ్ క్రీమును ఉపయోగించుడు.




ఇది చర్మరంధ్రములలో చొచ్చి లోపల, బయట నుండు మురికిని తీసి వేయును. ప్రతిరాత్రి, ఉదయము ఈ క్రీమును ముఖమునకు, మెడకు తట్టుడు. కొన్ని నిమిషములు వదలిన ఇది చర్మరంధ్రములలో పోవును. తర్వాత దీనిని తుడిచివేయుడు.

రెండవది: పగటిపూట మీ ముఖచర్మమును కాపాడుటకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును వాడుడు. దీనినుండి ముఖముమీద, మెడమీద కంటికగుపడని, జిడ్డులేని పొర యొకటి ఏర్పడును. ఈ పొర మీ ముఖమును దుమ్ము, గాలి, ఉష్ణము వీటినుండి రక్షించును.

ఇప్పటినుంచే పాండ్స్ క్రీములను ఉపయోగించుటకు ప్రారంభించుడు. కొన్ని వారములలో మీ ముఖము గులాబి పుష్పమువలె మృదువుగా, మనోహరముగా నుండును.

★ పాండ్స్ క్రీమ్ ★

# ఎడ్డీ, లేక, సరిగా చూపబడిన దాతృత్వం

కథకుడు :
అనటోల్ ఫ్రాన్స్

అనువాదకుడు :
మే. స. శ.

హోర్టియర్, 'ల్ ఎటోయిల్' పత్రికయొక్క వ్యవస్థాపకుడూ, 'లా రెవ్యూ నేషనల్', 'లి నావి యే సియెకిల్ ఇల్లస్ట్రి' అనే పత్రికలకు రాజకీయ, సారస్వత సంపాదకుడూ అయిన హోర్టియర్, తన సంపాదకుడి గదిలోకి నన్ను ఆహ్వానించి, తన సంపాదక ఆసనంలోనుంచి నన్ను సంబోధించి ఈవిధంగా పలికాడు :

'మార్ట్యూ, 'లి నావి యే సియెకిల్' యొక్క ప్రత్యేక సంచికకు నాకొక కథను వ్రాసి ఇయ్యి. ఉగాదినాటికి మూడువందల పంక్తులు. మంచి సాంఘిక వాతావరణంతో, ఉషారుగా ఉండేది ఏదైనా ఒకటి.'

నేను హోర్టియర్‌తో, అది నా పద్ధతిలోది కాదనీ, అధమం అతను దాన్ని ఏవిధంగా అర్థంచేసుకున్నాడో ఆ విధం మటుకు నా పద్ధతిలోది కాదనీ, కాని అతనికొక కథను వ్రాసియ్యటానికి నేను సిద్ధడననీ చెప్పాను.

'అది భాగ్యవంతులకై ఒక కథ అయ్యుండటం నాకు ఇష్టం', అన్నాడతను.

'బీదవాళ్లకైన కథ ఒకటి నే నెన్నుకుంటాను.'

'నే ననుకునేదీ అదే. భాగ్యవంతులకు బీదవాళ్లంటే కరుణను పురికొల్పే ఒక కథ.'

'కాని నేను అభ్యంతరపెట్టడం సరిగ్గా అటువంటిదానికే. బీదవాళ్లంటే భాగ్యవంతులు కరుణ గలిగి ఉండటం నా కిష్టంలేదు.'

'విచిత్రం!'

'కాదు, అది విచిత్రం కాదు, శాస్త్రీయం. నా ఉద్దేశ్యంలో బీదవాళ్లంటే భాగ్యవంతులు చూపే కరుణ మానవసోదరత్వాన్ని దూషించటమూ, మానవసోదరత్వం లేదనటమూనూ. భాగ్యవంతుల నుద్దేశించి నన్ను పలకమని నువ్వు కోరితే నేను చెప్తాను : 'బీదవాళ్లకు మీ కరుణ చూపించకుండా వాళ్ల దారిన వాళ్లను వదిలేసెయ్యండి : దానివల్ల వాళ్లకు ప్రయోజనంలేదు. కరుణ ఎందుకనీ, న్యాయమెందుకు కాదూ? వాళ్ళతో మీకొక పద్దున్నది. దాని విషయం తేల్చండి. ఇది మనోభావాలకు సంబంధించిన ప్రశ్న కాదు. ఆర్థికసంబంధమైన విషయం ఇది. మీరు వాళ్ళకు ఇవ్వటానికి దయతో అంగీకరించునది వాళ్ళ బీదతనాన్ని బీదతనంగానే ఉంచి, మీ భాగాన్ని దానిమోస్తరుగానే ఉంచి, అవే జరిగిపోతూ ఉండేందుకుగాను నిర్దేశింపబడినదైనట్లైతే, మీ రిచ్చేటటువంటిది శుద్ధ అన్యాయపుది; దీనితోపాటు కరుణను వెలిబుస్తూ మీరు కన్నీళ్లు కార్చినా, ఆ కన్నీళ్లు మీరిచ్చేదాన్ని న్యాయమైనదిగా చెయ్యలేవు. మీరు మీరుచేసిన అన్యాయాన్ని తొలగించేందుకుగాను చెయ్యవలసిన న్యాయం చెయ్యాలి. ఆ చెయ్యవలసిన న్యాయం చెయ్యకుండా ఉండేందుకుగాను మీరు భిక్షం వేస్తూ ఉంటారు. బోలెడు అట్టేపెట్టుకునేందుకుగాను మీరు

కాస్త ఇస్తారు; అట్లా చేస్తున్నందుకు అతిసంతోషం పొందుతారు మీరు. ఇటువంటిదే ఒక కారణానికి శామోస్ దేశపు నిరంకుశపరిపాలకుడైన పాలిక్రెటిస్ తన ఉంగరాన్ని సముద్రంలో విసిరేశాడు. కాని ఆ రాజు చేసిన నిరంకుశ పరిపాలనకు ప్రతిఫలం అతననుభవించవలసిందేనని దేవతలు ఆ కానుకను పుచ్చుకోటానికి నిరాకరించారు. తిరిగి ఆ ఉంగరం ఆ నిరంకుశ పరిపాలకుడికి చేరింది.—ఒక బెస్తవాడు ఒక చేపను తీసుకొచ్చి అతనికిస్తే, ఆ ఉంగరం దాని కడుపులో ఉండింది. తర్వాత పాలిక్రెటిస్‌కు తన సంపదంతా, కాస్తైనా మిగలకుండా పాడయిపోయింది.'

'హాస్యమాడుతున్నావు నువ్వు.'

'నేను హాస్యమాడటంలేదు. వాళ్లు చూపే ధర్మబుద్ధి చాకబారుదనీ, వాళ్ళ దాతృత్వంవల్ల వాళ్ళకయ్యేది చాలా సూక్ష్మమనీ, వ్యవహారం నడపటానికి అటువంటిది మరి సరైన మార్గం కాదనీ భాగ్యవంతులు అర్థంచేసుకునేటట్లు చెయ్యాలని నా కోరిక. వాళ్ళకు ఉపయోగం ఉండొచ్చు నీ యభిప్రాయంవల్ల.'

'మరి ఇవా, పత్రికయొక్క ప్రచారం ఎక్కువయ్యేందుకుగాను 'లి నావి యె సియెకిల్'లో వెలిబుచ్చబోయే భావాలు! అటువంటివి కాస్తకూడా వద్దు, మిత్రమా! కాస్తకూడా!'

'భాగ్యవంతులూ, మంచి పలుకుబడిగలవారూ అయినవారియెడల భాగ్యవంతుడు ప్రవర్తించే విధంకన్న వేరైన విధంగా బీదవాళ్ళయెడల ప్రవర్తించాలని నువ్వంత పట్టుదలగా ఉంటావు దేనికి? భాగ్యవంతుడు భాగ్యవంతులకు తనెంత ఇవ్వాలో అంత ఇస్తాడు, వాళ్ళకేమీ బాకీలేకపోతే ఏమీ ఇవ్వడు. అది నూటిగా నడుచుకోటం. అతను నూటిగా నడుచుకునేవాడయితే బీదవాళ్ళకు సంబంధించినదానియందు కూడా ఆవిధంగానే చెయ్యమను. మరి నాకు చెప్పకు భాగ్యవంతులు బీదవాళ్ళకేమీ బాకీలేరని. ఒక్క భాగ్యవంతుడుకూడా అట్లా అనుకుంటాడని నేననుకోను. బాకీ ఎంతో ఆ విషయంమీద అభిప్రాయాలు భేదించటానికి మొదలుపెట్టేది. మరి ఎవ్వడికీ తొందరగాలేదూ ఈ సమస్యను విడదీయటానికి. విషయాన్ని పొగకమ్మినదాని మోస్తరుగా స్ఫుటీకరించకుండా వదిలేసెయ్యటం మంచిదని అనుకోటం జరుగుతున్నది. ప్రతివాడికీ విదితమే తను అప్పులో ఉన్నాడని. కాని తను ఎంత బాకీయో నిశ్చయంకాదు; సరి, ఇంకేం అప్పుడప్పుడు కాస్త జమకింద ఇయ్యబడుతుంది. దాన్ని దాతృత్వమంటారు, మరి అది లాభకరం.'

'కాని, భాయీ, నువ్వు చెప్తూఉన్నదానిలో ప్రపంచజ్ఞానం ఏమీలేదు. బహుశా నీకన్న నేను కాస్త ఎక్కువ సామ్యవాదిని, కాని నేను కార్యశూరుడుని. బాధను తగ్గించటం, ఒక జీవితాన్ని ఇంకా కొంతకాలం జరిగిపొయ్యేటట్లు చెయ్యటం—ఇట్లా చెయ్యటం ఒక ఫలితాన్ని పొందటమన్నమాట. ఒకడు కాస్త మంచిచేసినా ఏదో కొంత చేసినట్లే. అంతా కాదది, కాని కొంత. నేను నిన్ను వ్రాయమని అడిగే కథ భాగ్యవంతులగు నా చందాదారులు ఒక వందమంది హృదయాలకు ఎక్కి, వాళ్ళను బీదవాళ్ళకై ఇవ్వటానికి ఒప్పిస్తే, అంతమటుకు మనం బాధనుంచి అన్యాయంనుంచి జయించినట్లే. ఆ విధంగా కొద్ది కొద్దిగా బీదవాళ్ల పరిస్థితి సహించ వీలయినదిగా చెయ్యబడుతుంది.'

'బీదవాళ్ల పరిస్థితి సహించ వీలయినదిగా అవటం మంచిదేనా? బీదతనం భాగ్యవంతతనానికీ, భాగ్యవంతతనం బీదతనానికీ తప్పవు. ఈ పాపాలు రెండూ ఒకదానివల్ల ఒకటి పుట్టాయి, ఒకదానివల్ల ఒకటి అభివృద్ధి చెందుతాయి. అభివృద్ధి చెయ్యబడటంకాదు బీదవాళ్ల పరిస్థితికి కావలసింది, అణిచివెయ్యబడటం.

నేను భాగ్యవంతులను భిక్షం పెట్టటానికి ప్రోత్సహించను. ఎందుకంటే, వాళ్ల భిక్షలు విషపూరితాలు కనుక, వాళ్ల భిక్షలు ఇచ్చేవాడికి మంచినీ, తీసుకునేవాడికి హానినీ చేస్తాయి కనుక; క్లుప్తంగా చెప్తే, భాగ్యవంతతనం స్వభావసిద్ధంగా కఠినపుదీ, నిర్దాక్షిణ్యపుదీ కనుక. అది దయ అనే దొంగవేషం వేసుకోగూడదు కనుక. భాగ్యవంతులకై ఒక కథ వ్రాయమని నన్ను కోరావు కాబట్టి, నేను వాళ్లకి చెప్తాను: 'మీ బీదవాళ్లు మీ కుక్కలు; కరిచేందుకుగాను మీరు వాటికి ఆహారం పెడ్తారు. వాళ్లు కూలీలు, కర్షకులు అంటే మొరుగుతారు. భాగ్యవంతులు అడిగేవాళ్లకు మాత్రమే ఇస్తారు. పాటకప్రజనం ఏమీ అడగరు, ఏమీ పొందరూ.'

'కాని కుంటి, గుడ్డివాళ్లు, ముసలివాళ్లు, తల్లిదండ్రులు లేనివాళ్లు, వాళ్లో?......'

'జీవించటానికి హక్కు వాళ్లకున్నది. వాళ్లకోసం నేను కరుణను పురికొల్పను, న్యాయానికై వాదిస్తాను.'

'ఇదంతా ఊరికే సిద్ధాంతాలు చెయ్యటం! వ్యవహారాని కొద్దాం. నాకొక ఉగాది కథానికను వ్రాసియ్యి, సామ్యవాదాన్ని గురించిన సూచనను ప్రవేశపెట్టొచ్చు నువ్వింకా. సామ్యవాదం చాలా 'ఫాషనబుల్'. అది గౌరవప్రదమైనది కూడాను. నేను మాట్లాడేది గ్యుయెస్డే లేక జొరెస్ యొక్క సామ్యవాదాన్ని మనస్సులో ఉంచుకుని కాదనుకో, కాని ఈ ప్రపంచవ్యవహారం తెలిసిన మనుష్యులు తెలివితేటలతోను, రైటుగాను 'కలెక్టివిజమ్'కు వ్యతిరేకంగా ఉండే మధ్యరకపు సామ్యవాదాన్ని మనస్సులో ఉంచుకుని మాట్లాడుతున్నాను. నీ కథలో కొన్ని యువక ముఖాలను వేసుకో. అది సచిత్రంగా ప్రకటించబడుతుంది. మరి పాఠకులకు చిత్రాలు ఆహ్లాదకరంగా ఉండటం ఇష్టం. రంగంమీదికి ఒక అమ్మాయిని తీసుకురా, ఒక చక్కని అమ్మాయిని. అది కష్టం కాదు.'

'కాదు, అది కష్టంకాదు.'

'వంటిళ్ల పొగగొట్టాలనుంచి మసిని దులిపే ఒకచిన్న అతన్ని ప్రవేశపెట్టలేవూ? నాదగ్గిరొక చిత్రం తయారుగాఉంది, ఒక వర్ణచిత్రం. మేడలీన్ భవనంయొక్క మెట్లమీద ఒక అమ్మాయి పొగగొట్టాల నుంచి మసిని దులిపే ఒక చిన్నవాడికి భిక్షం వెయ్యటాన్ని చూపిస్తుందది. దాన్ని ఉపయోగించటానికి ఈ అవకాశం సరిగా ఉంటుంది......అప్పుడు చలిగా ఉంది, మంచుపడుతున్నది: ఆ మసిదులిపేవాడి చేతిలోకి ఆ అందమైన అమ్మాయి ఒకడబ్బును జారవిడుస్తున్నది. దాన్ని చూడగలవా నువ్వు?'

'చూస్తున్నాను.'

'ఆ ఘట్టాన్ని పెంచి వ్రాయి.'

'దాన్ని పెంచుతాను. మసిదులిపే ఆ చిన్నవాడు కృతజ్ఞతతో పరవశుడై తనచేతులను ఆ అమ్మాయి మెడచుట్టూ వేస్తాడు. ఆ అమ్మాయి కౌంట్ డి లినోట్ కూతురవుతుంది. ఆ చక్కని అమ్మాయి చెక్కిలిమీద ఒక చిన్న గుండ్రని మసి O ను ముద్రించి అతను ఆ అమ్మాయికొక ముద్దిస్తాడు. చాలా మనోహరమైన ఒక చిన్న O అది, పూర్తిగా గుండ్రంగానూ, పూర్తిగా నలుపుగాను ఉన్నది. ఎడ్మీ (ఆ అమ్మాయిపేరు ఎడ్మీ) అటువంటి మనఃపూర్వకమైనటువంటి, అపూర్వమైనటువంటి సంబంధానికి విముఖతను చూపలేదు......ఈ ఆలోచన చాలినంత విచారాన్ని కొల్పేదిగానూ ఉన్నదనుకుంటాను.'

'అవును. దాన్ని ఆధారంచేసుకుని ఏదో కొంత చెయ్యొచ్చు నువ్వు.'

'నువ్వు నన్ను ఇంకా చెప్పటానికి ప్రోత్సహిస్తున్నావు. బౌలెవార్డ్ మాలెస్ హెర్బ్స్‌లో ఉండి సర్వమూ కలిగిఉన్న తన ఇంటికి తిరిగివచ్చిన వెనక, తన మొగము కడుక్కోటానికి విముఖతను చూపుతుంది. ఎడ్మీ తన జీవితంలో మొట్టమొదటి పర్యాయం: ఆ పెదవుల ముద్రను తన చెక్కిలిమీద అట్టే పెట్టుకోటం ఇష్టం ఆ అమ్మాయికి. ఈలోగా మసిదులిపే చిన్నవాడు ఆ అమ్మాయిని వాళ్ల గుమ్మందాకా వెన్నంటుతాడు. మనోహరాకృతిగల ఆ అమ్మాయి నుంచుని బయటికి చూస్తున్న కిటికీకింద తన్మయుడై నుంచుంటాడు ...అది సరిపోతుందా?'

'అబ్బే, చాలూ!'

'నేను సాగిస్తాను. మరునాటి ఉదయం, తన చిన్న తెల్లటి పక్కమీద పడుకుని, వంటింటి పొగ గొట్టంమీదినుంచి కిందికి దిగివస్తున్న మసిదులిపే చిన్నవాడిని చూస్తుంది ఎడ్మీ. ఏమాత్రమూ జాగుచెయ్యకుండా అతను ఆ చక్కని అమ్మాయిమీద పడతాడు, ఆ అమ్మాయిని చిన్న గుండ్రని మసి O లతో నింపుతాడు. నేను నీకు చెప్పటం విడిచాను, అతను అతి అందమైనవాడు. ఆవిధంగా సంతోషంగా నిమగ్నుడై ఉండగా కౌంటెస్ డి లినోట్ తలవని తలంపుగా, అతను ఆశ్చర్యపడేటట్లు అక్కడికొస్తుంది. ఆవిడ సన్నటి గొంతుతో ఎలుగెత్తి కెవ్వుమంటుంది, సహాయంకోసం కేకేస్తుంది. కాని అతను ఎంతగా నిమగ్నుడై ఉన్నాడంటే, అతను చూడనూ చూడడు, విననూ వినడు.'

'మిత్రమా, మార్ట్యూ......'

'అతను ఎంతగా నిమగ్నుడై ఉన్నాడంటే, అతను చూడనూ చూడడు, విననూ వినడు. కౌంట్ గదిలోకి గబ గబ వస్తాడు. అచ్చ భాగ్యవంతుడి హృదయం ఆయనది. ఆయన ఆ మసిదులిపే చిన్నవాడి మడిమలు పుచ్చుకుంటాడు......అతన్ని కిటికీగుండా అవతలికి విసిరేస్తాడు.'

'మిత్రమా, మార్ట్యూ......'

'తొందరగా పూర్తిచేస్తాను....తొమ్మిదినెలల తర్వాత మసిదులిపే ఆ చిన్నవాడు పెద్దఇంట పుట్టిన ఆ అమ్మాయిని పెళ్లిచేసుకున్నాడు. ఇంకా అసలది తరువాంకూడాను. అదీ సరిగా దాతృత్వం చూపినదాని ఫలితం'

'మిత్రమా, మార్ట్యూ, నన్ను మనస్సులో ఉంచుకుని చాలాసేపు వినోదించావు నువ్వు.'

'కాస్తకూడా కాదు. మేడమాయ్‌సెల్ డి లినోట్ (అనగా ఎడ్మీ)ని పెళ్లాడి అతను మత బోధకులకు సంబంధించిన ఒక కౌంట్ అయి, గుర్రపు పందాలలో డబ్బునంతా పోగొట్టుకుంటాడు. ఈ నాడు ర్యూ డి లాగైట్‌లో మాంట్పార్నెసీ వద్ద అతనొక స్టవ్వుల వ్యాపారస్థుడు. అతనిభార్య అతని కొట్టులో ఉంటుంది, ఒక్కొక్కటి పద్దెనిమిది ఫ్రాంకుల చొప్పున, ఆ పద్దెనిమిది ఫ్రాంకులనూ ఎనిమిది నెలలలో ఇచ్చేలాగున, స్టవ్వులను అమ్ముతూ ఉంటుంది.'

'మిత్రమా, మార్ట్యూ, ఇది సరసాలకు సంబంధించిన వ్యవహారం కాదు.'

'జాగ్రత్తగా చూసుకో, మిత్రమా, హార్టియర్. నేను నీకిప్పుడు చెప్పింది నిజంగా లామార్టైన్ చెప్పిన 'భూట్ డి అన్ యాంగీ' యున్నూ, ఆల్ఫ్రెడ్ డి విగ్నీ వ్రాసిన 'ఎలోవా' యున్నూ. ఎన్ని విధాల చూసినా, జనం వాళ్లు దయకలవారు కానే కాకపోయినా తమరు అతి దయగలవారనిన్నీ; వాళ్లు మంచి దనిపించగల దేమీ చెయ్యలేకపోయినా తాము మంచి చేస్తున్నామనీ; దాతృత్వం చూపటం ప్రపంచంలో కల్లా అతికష్టమైన దైనప్పుడు దాతృత్వం చూపటం తమకు అతి సులభమనీ జనాన్ని నమ్మేటట్లు చేసే నువ్వు ప్రకటించే కళ్లనీళ్ల కథలకన్న అది మెరుగు. నా కథ నీతితో కూడుకున్నది. అదీకాక అది మంచి జరగవచ్చుననే నమ్మకంతో కూడుకున్నదీ, సుఖంగా అంతమయ్యేదీనూ. ఎందుకంటే, తను ఏ రాజకీయ వేత్తకో, పెద్ద ఉద్యోగికో వివాహం చెయ్యబడినట్లయితే విందులు చెయ్యటంలోనూ, వినోదాలలో పాల్గొనటంలోనూ ఆవిడకు దొరికిఉండని సంతోషం ర్యూ డి లా గైట్‌లో ఉన్న తన షాపులో తనకు దొరికింది ఎడ్మీకి......సంపాదక మహాశయా, మనిద్దరికీ సమ్మతేనా: 'నా వియే సియెకిల్ ఇలస్ట్రీ' లో వెయ్యటానికి 'ఎడ్మీ, లేక సరిగా చూపబడిన దాతృత్వం'ను తీసుకుంటావా?'

'గట్టిగానే అడుగుతున్నావా దాన్ని నువ్వు?...'

'గట్టిగానే నిన్నడుగుతున్నాను. నువ్వు నా కథను వేసుకోకపోతే, నేను దాన్ని వేరే ప్రకటిస్తాను.'

'ఎక్కడా?'

'ఏదో ఒక పేరుబడ్డసిన పత్రికలో'

'ప్రకటించు, చూస్తానుకాదూ!'

'చూస్తూ ఉండు.'

మష్యూర్ డి రోడే సంపాదకుడుగా ఉన్న 'ఫిగారో' పత్రిక 'ఎడ్మీ, లేక సరిగా చూపబడిన దాతృత్వం'ను ప్రకటించింది. అది అసలు ఆ పత్రికయొక్క పాఠకులకు ఉగాదికానుకగా అందజేయబడింది.

---

# "లాంఛనములు"

విధునకు మచ్చయున్, గవికి పిచ్చియు, కాంతకు లజ్జయున్, మహో
దధికిని ఘోషణంబు, జడదారికి మేనను బూదెపూతయున్
విధికిని నాల్గుమోములును, పేదకు పెద్దకుటుంబ భారమున్
బుధునకునోర్మి, సెట్టికిని బొజ్జయు లాంఛనముల్ దలంపగన్!

—దేవుపల్లి సత్యారావు.



మహిళా సంఘము, గుంటూరు

గుంటూరుజిల్లా 15 వ మహిళాసభలో తీయబడిన ఫోటో. పుష్పమాలాలంకృతలు : జిల్లా కలెక్టరు సతీమణి పద్మావతమ్మగారు, తలారి చంద్రమతమ్మగారు, మూల్పూరి చుక్కమ్మగారును.



అనంతపురమున నుండు శ్రీ భారతి మహిళా శారదా సమాజపు 22-వ వార్షికోత్సవ సందర్భమున తీయబడిన ఛాయాపటము

శ్రీమతి టి. లక్ష్మీ భాస్కరరావు సతి అధ్యక్షత వహించిరి. వారు పుష్పమాల ధరించి మధ్యన కూర్చున్నారు. వారి కుడిప్రక్కన సమాజాధ్యక్షురాలైన శ్రీమతి హట్టి పిళ్ళమ్మ గారును, ఎడమప్రక్కన సమాజ ఉపాధ్యక్షురాలైన ఎమ్. శేషమ్మ గారును కూర్చొనియున్నారు.

# కులస్త్రీలు నాటకరంగములలో పాల్గొనుట శోచనీయమా?

## శ్రీ నాదెళ్ల రామకృష్ణశాస్త్రిగారు

అక్టోబరుమాసమున వెలువడిన గృహలక్ష్మియందు శ్రీమతి వేదవల్లి తాయారమ్మగారిచే రచింపబడిన "కులస్త్రీలు: నాటకరంగము" అను వ్యాసమును చూచు అవకాశము నాకబ్బినది. వీరి వ్యాసమును సావధానముగా పరికింపగా "కులస్త్రీలు నాటకరంగములలో పాల్గొనుట శోచనీయమనియు పాల్గొనినయెడల వారల గౌరవమర్యాద లేటగలిసి పతితులగుదురనియు ఇండ్లలో అనేక కట్టుబాట్లతో నుండిన వారికే అవాంతర సన్నివేశములు గలిగి శీల రక్షణకు దుస్సాధ్యమగుచుండగా ఇక వీరిమాటలు వేరుగాచెప్ప నావశ్యక మింతయు లేదనియు; సంఘమున కతి బాధాకరమైన ఇట్టి పద్ధతి నశించుటయే మేలనియు, భారతజాతీయతను బదిలపరచు రత్నపేటికలనదగు స్త్రీ రత్నములను రచ్చకెక్కించుటకంటె గోప్యముగా నుంచుటయే సంఘశ్రేయమని" ఏమేమో వ్రాసిరి. వీరి రచన కాధారము ప్రాచీనపురాణేతిహాసములందించుక భక్తి ప్రపత్తులు గల్గియుండుటయే యని చెప్పక తప్పదు. కాని యా భక్తి ప్రపత్తులు ప్రతి ప్రాచీన గ్రంథరాజమందును ఉంచుట సమంజసము గాని మనకు పనికివచ్చునంతవరకు గ్రహించి వ్యతిరిక్తముగానున్న విషయమును గ్రహింపకుండుట శోచనీయము. ప్రాచీన గ్రంథరాజమగు భరతశాస్త్రకారుడేమని నుడివెనో ఇంచుక పరికింపుడు. "ప్రాయేణతు స్వభావాత్, స్త్రీణాంగానంనృణాందపాఠ్యవిధి: స్త్రీణాం స్వభావమధుర: కంఠోనృణాం సులలిత్వంచ" పురుషునిగాత్రము స్వభావమువల్లనే సులలితముగాను, స్త్రీగాత్రము స్వభావమువల్లనే అతిమధురముగా నుండుననీ, పురుషులు గద్యప్రధానపాత్రలను, స్త్రీలు సంగీతప్రధాన పాత్రలను గ్రహించవలయునని తెలియుట లేదా? అదియునుగాక "పురుష స్త్రీగతంభావం యత్రప్రమరుతేపునరూపానురూప సాక్షేయాప్రయోగే ప్రకృతిస్తథా, శృంగారరస మాసాద్య స్త్రీణాం ఛాయంప్రయోజయేత్, ఈహామృగేపి తత్స్యాత్ కేవల మాత్రస్త్రియాయోగః" అను శ్లోకములనుబట్టి కొన్ని ప్రదర్శనములను (ముఖ్యముగా శృంగారరస ప్రధానమైనవి) స్త్రీలచేతనే అభినయింప చేయవలెననియు అర్థమగుటలేదా?

"ఇక స్త్రీ పురుషులు అన్యోన్య సమాకర్షణములు (రంగపర్యములగు) ఆలింగన చుంబనాదులు స్వయముగా జరుగునపుడు ప్రేక్షకులతో బాటు నటకులకును రసావేశముగల్గి యాభాసయగునన్న నేరము గాదన జాలరు గదా" యని నుడివిరి. వీరి శంకకును భరతశాస్త్రకారుడు సమాధాన మీయకపోలేదు:

> "నకార్యం శయనం రంగే నాట్యంధర్మం విజానవా
> కేన చిద్వచనార్థేన భేదమత్రప్రయోజయేత్
> యథాస్వపేదరవశ దేకాకీ సహిత్రోపివా
> చుంబనాలింగనాదీని రంగమధ్యే నకారయేత్.
> దంతం నఖక్షతంఛేద్యం నీవీసంసనమేవచ
> స్తనాధరవిమర్ధంచ రంగమధ్యే న కారయేత్"

ఇవియేగాక రంగవర్జ్యములగు క్రీడలగు మరికొన్నియును గలవు. కాన కులస్త్రీలు నాటకరంగములలో ప్రవేశించినంతమాత్రమున వారల శీలమున కేమాత్రము భంగము వాటిల్లదనియు, పాల్గొనకుండుటవల్లనే మన లలితకళలు వృద్ధిపొందజాలకుండినవనియు శ్రీమతి వేదవల్లితాయారమ్మగారు గ్రహించి తమ యభిప్రాయము నికముందైనను మార్చుకొందురని తలచుచున్నాను.

# సత్యభామ

ఎన్నఁడో వామపాదాన మున్న నీవు
తన్నినావట సత్య! మాధవుని, నిజమె?
అయ్యొ! యెంతటి ఆగ్రహమమ్మ నీది!
తగునె యిల్లాండ్ర కిటువంటి తప్పిదములు?

ఎవ్వఁడాత డటంచు యూహించినావొ!
రాజ రాజులు ఆతని ప్రాపుగోరి
అతని కనుసన్న మెలగుదు, రంతెగాదు,
దేవ దేవుల శాసించు దివ్యుఁడతడు.

వెఱ్ఱిగొల్లండని వింటివిగాబోలు
కాదు - లోకాలకే కాపతండు
జార చోరుడటన్న పేరు విన్నావేమొ,
మనసు చలింపని ఘనుడతండు.

అల్లరివాడని అనుకొనుచుంటివా?
విమల సుగుణ సారవేత్త యతడు,
నల్లనివాడని నమ్మితివా యేమి?
భద్ర సౌందర్య సముద్రు డతడు.

అంద మానంద మొకచోట నందగించి
ప్రభవమొందిన సౌభాగ్యవిభవు డతడు,
రత్న ఖచితైక కౌస్తుభ రమ్యహార
మణివిభూషితు డతడు, సామాన్యు డగునె?

అమ్మ లక్కలు గూడి నిన్నాడిపోయ
కవులు కావ్యాల వ్రాసిరీ గాథలెల్ల,
యుగ యుగంబుల దుష్కీర్తి యుండు నీకు,
నీవు సౌశీల్యవతులలో లేవు పుడమి.

ఎంతవారింట పుట్టిననేమి, సత్య!
ఏ మహామహుఁజేరిన నేమిఫలము?
అనుభవింపక తప్ప దావంతయైన
స్వీయకర్మానుభవములు, చిత్రగతులు!

శ్రీ కర్లపాలెం
కృష్ణరావు



ఈ రెండు బిడ్డలకును దాని
శ్రేష్ఠమైన గుణము తెలియును

ఉడ్‌వర్డ్స్
గ్రైప్‌వాటర్ బిడ్డలను
రక్షించుచున్నది






# WOODWARD'S
## GRIPE WATER
*keeps baby well*

I-WW 109-111—TL.

W. WOODWARD LTD. LONDON, ENGLAND

# లక్ష్మీ ప్రసన్నం

ం ం ం ం

శ్రీమతి పాలంకి సూర్యప్రకాశమ్మగారు

## 1 వ రంగం

(లక్ష్మీదేవి ఓ పేద ముత్తైదువకుమల్లే వచ్చి, కావమ్మగారి యింటికెదురుగుండా నిలబడి)

లక్ష్మి : ఎవరు చెప్మా యీ ఇల్లాలు! శుక్రవారప్పూటా ఇంత పొద్దెక్కినా పాచిపనీ చేసుకోలేదు! అదిగో వస్తోంది. ఆవిడే కాబోలు! ఏమితీరు? ఆ తుప్పతలా, ఆ జోగూ చూస్తే పెద్దమ్మని మాడక్కర్లేదు వేరే......ఇలాంటి ఎడ్డమనిషికి సిరెలా అబ్బింది చెప్మా......ఈవిడెలాంటిదో కాస్త పలకరించి చూద్దునా?

కావమ్మ : ఎవరూ ఆ గడపలో? ఎందుకమ్మా అలా తొంగిచూస్తున్నావ్? ఏం కావాలి?

లక్ష్మి : నేను ఓ పేదముత్తైదువనమ్మా.

కావ : ఉహుం! ఐతే ఏమంటా వేమిటి?

లక్ష్మి : నిన్న పొద్దున్ననగా బయల్దేరాను. అప్పణ్ణుంచీ తిండీ తిప్పల్లేవు.

కావ : ఐతే నన్నేంచెయ్యమన్నావ్?

లక్ష్మి : నడిచినడిచి వస్తే కాళ్లు లాగుతున్నాయ్. ఈ పూటకి గుప్పెడన్నం నీ యింట్లో పెడితివా, తిని, కాస్త చల్లబడ్డాక బయల్దేరి పోతాను.

కావ : సరి! సరి ఈ సోదంతా యిందుకా? అడ్డమైనవాళ్లమనుకున్నావా ఏమిటి? ఇక్కడ వీల్లేదు. దయచెయ్యి.

లక్ష్మి : ఎందుకమ్మా, అంత చిరాకు? ఏదో పేదముత్తైదువనని శుక్రవారప్పూటా అడిగేను. నీకింత కష్టంగా ఉంటుందంటే నోరుతెరిచి అడక్కేపోదును.

కావ : ఔను. నీకేం తెలుస్తుం దాకష్టం, తేరభోజనాలు చేసేదానికి? మీ అందరికీ ఊరికే సంతర్పణలు చెయ్యడానికి అంత డబ్బేమీ పడి మూలగటంలేదు మా యింట్లో.

లక్ష్మి : పోనియ్యమ్మా, ఈమాత్రందానికి 'లేదు, లేద'నుకోగమెందుకు, నిండింట్లో కూచుని? 'లేద'ను కుంటే ఆఖరుకి లేకుండాపోతుంది కూడాను. ఇంకోయింటికి పోతాన్లే. గుప్పెడన్నం పెట్టే యిల్లాలే ఉండదూ, ఇంత ఊరున్నాక?

కావ : ఏవమ్మోయ్, పోయేదానవు నోరుమూసుకు తిన్నగాపోక, ఏమిటింకా గొణుగుతున్నావ్? దయచెయ్ తొరగా.

లక్ష్మి : పోతున్నానమ్మా తల్లీ! ఎగిరి కంట్లోపడకు.

♦ ♦ ♦ ♦

రమణ (ఆదారిని పోతో): ఏవూరమ్మా మనది? ఎక్కి ఎక్కి ఆ గుమ్మం ఎక్కేరేమిటి? ఆవిడ సంగతి తెలీదు కాబోలు.

లక్ష్మి : పొరుగూరిదాన్ని నాకేం తెలుస్తుందమ్మా? ఏదో పెద్దమేడ ఉందికదా, ఓపూట గుప్పెడన్నం పెట్టడానికే మొహంచూసుకుంటుందా అనుకున్నాను.

రమ : మీరొక్కరే కాదమ్మా, చాలామంది మోసపోయారు ఇలాగ. ఆ శాంతమ్మగారు వీళ్ల యింట్లో ఉన్నరోజుల్లో ఎవళ్లకైనా గుప్పెడు బియ్యమైనా వేసేది. ఆవిడెళ్లిపోయాక అదికూడా పుట్టటం లేదీయింట్లో.

లక్ష్మి : ఎవరమ్మా ఆ పుణ్యాత్మురాలు? ఎక్కడుందీ ఆవిడిప్పుడు?

రమ : ఈవిడ తోటికోడలే శాంతమ్మంటే. ఈ గయ్యాళి గంగమ్మ ఆవిణ్ణి యింట్లోంచి లేవగొట్టేసింది. పాపం వాళ్లు కొంచెం లేనివాళ్లు లెండి. ఆ సంసారం బరువు మనకెందుకని వాళ్లని వేరెట్టేసిందీవిడ. ఆ మహాయిల్లాలు వెళ్లిపోయాక యీ యింటి కళే పోయింది.

లక్ష్మి : అలాగా అమ్మా? అయితే ఆ శాంతమ్మగారెక్కడున్నారిప్పుడు?

రమ : ఈ ఊళ్లో లేరు. ఇక్కడే ఓ మైలుదూరంలో ఓ అగ్రహారం ఉంది. అక్కడుంటున్నారు.

లక్ష్మి : అహా...వెళ్తొస్తానమ్మా, పొద్దెక్కుతోంది.

## 2 వ రంగం

(అగ్రహారంలో శాంతమ్మగారి యింటిముందు లక్ష్మీదేవి నిలబడి)

లక్ష్మి : శాంతమ్మ యిల్లు ఇదేకాబోలు. అలుకులతోటీ, ముగ్గులతోటీ ఎంత కలకల్లాడుతోందీ! తాటాకుల ఇల్లవుతేనేం, ఎంత శుభ్రంగా ఉందో!

(లోపల్నుంచి లక్ష్మీస్తోత్రం వినిపిస్తుంది.)

లక్ష్మి : ఈ ఇల్లాలు నన్నే తలుచుకుంటోంది. నగలూ నట్రా లేకపోయినా ఈమె చక్కా పసుపు కుంకాలతో నిండుగా ఉంది. పాపం ఈమె లేమిలో ఉందనికదూ ఆ ఊళ్లో ఆవిడ చెప్పింది? లోపలికెళ్ళి పలకరించి చూస్తా, ఏమంటుందో ఈమె........ఎవరమ్మా లోపల?

శాంత : ఎవరోవారు! రండమ్మా! రండి! లోపలికి రండి, కూచోండి. శుక్రవారం మహాలక్ష్మిలా వచ్చారు. ఏవూరమ్మా మనది?

లక్ష్మి : మాదా? మాది నారాయణపురం అమ్మా. ఇలా మా వియ్యాలవారి ఊరెళ్తున్నా, కూతుర్నోమాటు చూసొద్దామని.

శాంత : ఆఁహా.

లక్ష్మి : 'పొద్దెక్కిందీ, ఎండలో నడవడం కష్టం, రెండు మెతుకులుతిని కాస్త చల్లబడ్డాక బయల్దేరిపోదాం' అనుకుంటున్నా. ఈపూట గుప్పెడన్నంపెట్టి నువ్వు పుణ్యం గట్టుకుంటివా—?

శాంత : అంతకంటేనా అమ్మా! శుక్రవారప్పూటా పెద్దముత్తైదువవు వొస్తే రెండుమెతుకులే పెట్టలేనూ?... ఇదిగో మావారొచ్చే వేళయింది. వారొచ్చి రావడంతోటే రెండునిమిషాల్లో వంటచేసి పెట్టేస్తాను.

లక్ష్మి : ఇంతవరకూ వంటలేదంటున్నావ్ ! ఇబ్బందిలో ఉన్నారు కాబోలు పాపం! ముందూ వెనకా చూసుకోకుండా సిద్ధమయాన్నేను.

శాంత : అబ్బే. ఇబ్బంది మరేంలేదు. ఆ భగవంతుడు ఎక్కడో అక్కడ ఇంత కలిగించకపోడు. వారు తెచ్చి తేవడంతోనే వండిపెట్టేస్తానమ్మా.

లక్ష్మి : అమ్మా, నా మాట విను. ఏపూట కాపూట తెచ్చుకుంటూన్న మీకు నా బలువుకూడా ఎందుకు? నేను మళ్ళోహ యింటికి వెడతాలే అమ్మా. నువ్వు మరోలా అనుకోకు.

శాంత : అయ్యొయ్యో. ఎంతమాటన్నారు ! మీరుగనక అలా వెళ్ళిపోతే నన్ను చంపుకుతిన్నట్టే.

లక్ష్మి : అయ్యొ వెఱ్ఱిదానా, ఎందుకూ అల్లాంటి ఒట్టుపెట్టేవు? అక్కడా అక్కడా కష్టపడి తెచ్చుకుని బతుకుతోన్న మీకు పైవాళ్లుకూడా ఎందుకని అలా అన్నాను, అంతేకానీ...

శాంత : దానికేంలెండి. కలిగినదాంట్లోనే మాతోబాటు వేళకొచ్చినవాళ్లూ తింటారు. దీనిలో మాకు పోయిం దేమిటి? అలా అని మీరేమీ సందేహించకండి.

లక్ష్మి : అమ్మా, నీలాంటి మహాయిల్లాల్ని నేనెక్కడా చూళ్లేదు. కష్టపడి తెచ్చుకున్నదేదో తామూ పిల్లలూ కడుపునిండా తింటారు కాని మీకుమల్లే అరదేసికీ పరదేసికీ అర్పించి అర్ధాకలి చేసు కుంటారా? ఇలాంటి 'తనకుమాలిన ధర్మం' ఎక్కడా ఉండదు.

శాంత : ఇందులో పెద్ద ధర్మమని చెప్పుకోడానికేముంది లెద్దురూ? మాకంటె ఎక్కువ ఆకలితో ఉన్నవాళ్లు కాని మా గుమ్మందాకా రానేరారు. ఓ పిడచ అలాంటివాళ్ళకు పడెయ్యకపోతే ఎలా?

లక్ష్మి : ఆకలిబాధంటే ఎరుగున్నదానవు గనక అలా అంటున్నావు. అందరూ నీలాంటి జాలిగుండెవాళ్లే ఐతే, ఎంత బాగుండిపోను! తమపొట్టకు సరిపడేదానికంటె ఎక్కువవుంటే నగలకనీ, నాణేలకనీ కూడ బెట్టుకుంటారు కాని, ఆర్చిచచ్చినా మధూకరపాడికి ఓ పిడికెడైనా పెట్టరుకదా! అదేం చిత్రమో, భగవంతు డలాంటివాళ్ళకే ఇస్తాడు ఐశ్వర్యాన్ని! కాస్త ధర్మబుద్ధి ఉన్న నీలాంటివాళ్ళ కివ్వకూడదూ?

శాంత : మాకుమాత్రం వచ్చిన లోటేమిటి తల్లీ! నీ దయవల్ల, చెప్పొద్దూ, ఓనాడు పట్టుమని నలుగురు భోజనానికొచ్చినా ఆ భగవంతుడు సమయానికెలాగో మాకు కలిగిస్తోనే ఉన్నాడు.

లక్ష్మి : ఎంతసేపు చెప్పినా పైవాళ్ళ భోజనాల గొడవే నీకు! అంతేకాని 'ఇదిలేదు, అదిలేదు' అన్న బాధ చీమంతైనా ఉన్నట్టులేదు చూస్తే.

శాంత : మంచి భర్త, బుద్ధిమంతులైన పిల్లలూ ఉన్న నాకు, ఇంకేం కావాలి? మీ దయవల్ల నాకే లోటూ లేదు.

లక్ష్మి : ఆ? ఏమిటీ? నీకు లోటేలేదూ? ఎంత తృప్తి!

శాంత : తర్వాత మాట్లాడుకోవచ్చు. లెండి. ఎండలో వచ్చారు. పాపం, ప్రాణం సొమ్మసిల్లిపోయుంటుంది. నీళ్లు పోసుకోండి. ప్రాణం కాస్త చల్లబడుతుంది. మీ భోజనానికిమాత్రం చాలా పొద్దుపోతోంది యీవేళ.

లక్ష్మి : దానికేంలే అమ్మా. నిన్నూ, నీ యింటినీ చూస్తేనే నా ఆకలి తీరిపోయింది.
శాంత : రండి. నేను నీళ్లుతోడి పోస్తాను. రండి.
లక్ష్మి : పద.

## 3 వ రంగం

సుబ్బమ్మ : రమణమ్మగారూ, శాంతమ్మ ముట్టింది ముత్యం, పట్టింది బంగారం ఐపోతోందిట విన్నారా?
రమణమ్మ : ఔను. వాళ్ళకి భాగ్యం వచ్చిందని విన్నా.
సుబ్బ : ఔతే! శాంతమ్మ మాత్రం బొందులో ప్రస్తే అవిడా, ఇదివరకుమల్లేనే ఉందిట.
రమ : ఇంత ఐశ్వర్యం పట్టినా శాంతమ్మలో ఏమీ మార్పు రాలేదన్నమాట!
సుబ్బ : ఎలా వస్తుంది? అదేమిటో కాని ఎంతొచ్చినా సంతర్పణలకీ సమారాధనలకీ ఖర్చుపెట్టేస్తోందిట!
రమ : పోనీలే. ఆవిడక్కావలసిందే అది. లేనిరోజుల్లో ఎవరైనా ఇంత అన్నంపెట్టమని వస్తే ఉన్నదేదో పెట్టేసి, పాపం వాళ్లకి కడుపునిండిందో లేదో అని బాధపడేది. ఇప్పుడు వచ్చినవాళ్లంతా తృప్తిగా తిని వెడుతున్నారంటే, ఆవిడకి బ్రహ్మానందమైపోతుంది.
సుబ్బ : ఔన్లే. కాని, వచ్చిందంతా ఇలా ఖర్చుచేసుకుక్కూచుంటే ఎలా?
రమ : పాతనీరు తోడేస్తే కొత్తనీరు రావటంలేదూ? అలాగే పెట్టినకొద్దీ పుడుతూనే ఉంటుందని ఆవిడధైర్యం.
సుబ్బ : అలా పుట్టకపోతే?
రమ : పోనీ, లక్ష్మీదేవి తనచేత ఖర్చుపెట్టించదలచింది అంతే అనుకుంటుంది.
సుబ్బ : రమణమ్మగారూ, ఎవరూ ఆ వస్తూంట? శాంతమ్మగారే లాగుందే? ఏం చెప్మా, ఇలా వస్తోంది!
రమ : వాళ్ళ తోటికోడలుగారింటికేమో?
సుబ్బ : ఏమండోయ్ శాంతమ్మగారు, చాలా హడావడిగా వస్తున్నారే.
శాం : అబ్బే, ఏమీలేదు. మా తోటికోడలుగారింటి కెడదామని....ఏమండీ రమణమ్మగారూ అంతా క్షేమమా?
రమ : ఆ. మీ దయవల్ల. ఏం? మీ తోటికోడలింట్లో ఏమైనా విశేషమా?
శాం : అబ్బే, ఏంలేదూ. పాపం యీమధ్య, వాళ్లింట దొంగలడి, అంతా దోచుకుపోయారు కాదూ. అప్పటి నుంచీ వద్దామని అనుకోడమే కాని కుదిరిందికాదు. వాళ్ళని తీసుకెళ్లి కొన్నాళ్లు మాయింట్లో ఉంచుకుందామనేసి వస్తున్నా. వెళ్లిరానా మరి?
సుబ్బ : మంచిది......రమణమ్మగారూ చూశారా, శాంతమ్మగారి మంచితనం? తన్ను యింట్లోంచి లేవగొట్టేసినా తోటికోడలంటూ యింకా దేముళ్లాడుతూనే ఉంది.
రమ : మరేం. తోటికోడలు కష్టంలో ఉందన్నమాట తప్ప, శాంతమ్మ పాతగొడవేమీ జ్ఞాపకం పెట్టుకోదు.
సుబ్బ : మరేం. వస్తానమ్మా, పొద్దెక్కుతోంది.
రమ : మంచిది.

# ప్రేమ – పెండ్లి

శ్రీ డి. కె. ప్రసాద్ గారు

(ఇరవయ్యో శతాబ్దపు మానవుని మానసిక ప్రవృత్తిని ఆధారముగా తీసుకొని వ్రాయబడ్డ వ్యాసము.)

పెండ్లికి ప్రేమకు అవినాభావసంబంధం ఉంది. చాలాచోట్ల పెండ్లిలేని ప్రేమ సఫలమౌతోంది. కాని, ప్రేమలేని పెండ్లి, లేక, సంసారం భగ్నమౌతోంది.

ప్రేమ అంటే ఏమిటో ఆలోచిద్దాం. ఇద్దరు వ్యక్తుల మానసిక ప్రవృత్తులు ఒకటిగా ఉండి, ప్రవర్తన, లేక, అలవాట్లు, ఇదేదీ కాక గుణాలే అనుకోండి, సరిపోయినప్పుడే ప్రేమ జనిస్తుంది. ఆ ప్రేమ ఇద్దరు సజాతివ్యక్తులకే కలగవచ్చును, లేక ఇద్దరు స్త్రీ పురుషుల మధ్య బయలుదేరవచ్చును. స్త్రీ పురుషు లన్నంతమాత్రాన, భార్యాభర్తలే కానక్కర్లేదు. తల్లీ కొడుకులు, సోదరీ సోదరులుకూడా ప్రేమించు కుంటారు. 'ప్రేమ' అన్న మాటకు 'కామవాంఛ' అన్న అర్థాన్ని తీసుకోవడం గొప్ప పొరబాటు. ఆ విధంగానే 'పెళ్లి' అనే మాటకు, ఒక స్త్రీ కాని, పురుషుడు కాని, సుఖలాలసత్వంకోసం, ఒకరినొకరు యావజ్జీవం గుత్తగా తీసుకున్నామనుకోవడం నీచప్రవర్తనను, నిరంకుశాధికారాన్ని తెలియజేస్తుంది. జీవితంలో ఇంద్రియనిగ్రహం, మనోనిశ్చలం, నిష్కల్మషాభిప్రాయాలు అత్యవసరం.

ఒక వ్యక్తిని 'ప్రేమించడం' అంటే, ఆ వ్యక్తి జీవితంలో, సుఖదుఃఖాలలో, కలిమిలేములలో కూడా సమభాగం పంచుకొని, సాధ్యమైనంతవరకు సహాయకారిగా ఉండడం. ఇంతేకాక, ఆ వ్యక్తి చేయ బోయే పనులలో, అవి చెడ్డవే కానీయండి, మంచివే కానీయండి, సహాయకారిగా ఉండి, కృతార్థులయే మార్గాన్ని సూచించడం.

చెడ్డవారు ఎప్పుడూ చెడ్డవారినే ప్రేమిస్తారు. 'కాకిపిల్ల కాకికి ముద్దు' కదా.

'పెళ్లి' అంటే—వివాహకాలంలో వరునిచేత 'యావజ్జీవం పోష్యామి' అని ప్రమాణం చేయిస్తారు. అంటే, అప్పటినుండీ ఆ వధువుయొక్క పోషణ భారమంతా వరునిదే. ఆ నాటినుండి వారు భార్యాభర్తలు. ఒక్కయింట్లో సాంసారిక జీవనాన్ని గడపవలసిఉంటుంది. ఒక విస్తట్లో తింటూ, ఒక మంచంమీద శయనించాలి. అట్లాంటివి ఒకరిగుణాలు ఒకరికి నచ్చితేనేగాని, జరగడానికి సావకాశంలేదు. భార్యాభర్త లిద్దరూ ఒకేబండికి కట్టబడిన ఎడ్లువంటివారు. ఇద్దరు సరియైన గమనంలో ఒకే లక్ష్యంమీద వెడితేనేగాని, సంసారశకటం క్షేమంగా గమ్యస్థానాన్ని చేరుకోలేదు.

భార్యాభర్త లవడం ఒక్క సంతానోత్పత్తికోసమే కాదు. అందుకొరకే అయితే, పెండ్లి ఎందుకు, ప్రేమ ఎందుకు, వావి వరుస ఎందుకు?

పురుషులుకాని, స్త్రీలుకాని చేయవలసిన ఘనకార్యాలు, వారి తాహతునుబట్టి అనేకం ఉండొచ్చు. అలా చేసినవారున్నారని మనకు చరిత్రకారులు నిదర్శనపూర్వకంగా నిరూపించారు. అట్టి వాటికి, ఒకరి సహాయం ఒకరికి అవసరం. ఉదాహరణకు - ఒక గణితశాస్త్రజ్ఞుడుంటాడు. అత డాశాస్త్రంలో

తీవ్రమైన పరిశోధనచేస్తూ, ఒక్కొక్కప్పుడు బాహ్యప్రపంచాన్నే మరచిపోతాడు. అట్టివానికి జీవనాధారమయిన ఆహారం ఎలా లభిస్తుంది? కూడా, అహర్నిశాలు అతన్ని కనిపెట్టుకుని ఉంటూ, ఎప్పుడేదికావాలో అందిచ్చే వ్యక్తి ఎవరో ఒకరు అతని జీవితాంతంవరకు ఉండాలి. అందుకు స్త్రీని ఎందుకు పెండ్లాడాలి? ఒక పురుషుణ్ణి ఎందుకు ఏర్పాటుచేసుకోరాదూ? అంటే, ఇట్లాగ స్త్రీలంతా స్త్రీలని, పురుషులంతా పురుషుల్నే ఆదరిస్తే, స్త్రీ పురుష జాతినిర్మాణానికి మూలకారణమైన సృష్టి ఆగిపోతుంది. అందుకనే, 'కామవాంఛ' అనేది ప్రకృతిసిద్ధంగా మానవులలోనే కాదు; అన్ని జీవరాసులలోను ఉంది. కాబట్టి, స్త్రీ పురుష జాతులు ఒకదానిపై నొకటి ఆధారపడియుండక తప్పదు. కానైనే, దానిలో అర్హతా నర్హతలు, సబబు సందర్భం, వావి వరుస, కూడినవి కూడనివి, ఉన్నాయి.

మరొక సంగతి - స్త్రీయొక్క మనోవాక్కర్మలందు మార్దవం పుట్టుకతోనే ఉంటుంది. మినహాయింపులేమైనా ఉంటే ఉండొచ్చును. ఆ మార్దవంలో పురుషుని లాలించే శక్తి ఉంది. ఆ లాలనవల్ల పురుషుని శ్రమ తాత్కాలికంగానైనా ఉపశమిస్తుంది. ఇందుకు ఆధారం ఒండొరులపై ఉండవలసిన అనురాగం. అదే ప్రేమ.

భార్యా భర్తల మధ్య కలిగే ప్రేమను మరో అవస్థ 'ప్రణయం'. ఇందులో పవిత్రత ఉండటానికి అవకాశముంది. ప్రకృతిసూత్రాన్ని పాటింపచేయగల సమర్థతా ఉంది.

నిష్కల్మషమైన ప్రేమలో కామానికి తావుండదు. ఆ ప్రేమికులకు అసలా తలంపే కలుగదు. ఒకవేళ మనుష్యస్వభావాన్నిబట్టి స్ఫురించినా, అందులో ఒకవిధమైన హైన్యత, నీచత్వం గోచరిస్తుంది. అట్టివారు తమ జీవితంలో తనను ప్రేమించేవారు, తన కష్టసుఖాలలో సమభాగం పంచుకొని, చేదోడు వాదోడుగా ఉండే వ్యక్తి ఇంకొకరున్నారు గదా అని సంతుష్టితో, ధైర్యంతో తన జీవితాన్ని గడపగలుగుతారు. వారు ఒకరినొకరు తాకనక్కరలేదు, కంటితో చూడనక్కరలేదుకూడా. మానసికంగా భావిస్తే చాలు, ఎంత కష్టాన్నైనా ధైర్యంతో గడిపేస్తారు. ఆ శక్తి వారలకు కలుగుతుంది. ప్రేమతత్వం బాగా బోధపడాలి. పెండ్లయినమాత్రాన, ఇంత అధికఫలాన్ని మనం ఆసించలేము. 'ప్రేమపెండ్లి' అంటే, 'ప్రేమతోకూడిన పెండ్లి' అయితే, ఇట్టి సుఖజీవనానికి పూర్తిగా అవకాశముంది.

విరాగులైన ధనిక దంపతుల జీవితంకన్న, ప్రేమించుకొన్న భిక్షుక దంపతుల జీవితం అనేకరెట్లు ఎక్కువ ఆనందమయంగా ఉంటుంది.

ఒక సంసారంలో భార్యా భర్తల బాధ్యత ఏమిటో చూదాం. తమ కష్టసుఖాలకే కాక, తమ సంతానం కష్టసుఖాలకుకూడా తామే కారకులౌతారు. ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా సుఖించాలంటే ఒకరినొకరు అర్థంచేసుకొని, మంచిచెడ్డలను తర్కిస్తూ, చెడునడతలకు, చెడుతలంపులకు, దురభ్యాసాలకి తావీయక, మంచి మార్గాన్నే అనుసరించాలి. అంతేకాని, ఏటికొకరు, కోటకొకరు లాగితే, సంసారబంధం తెగి ఊరుకొంటుంది. ఎడమొగాలు, పెడమొగాలుతో ఉంటే, విరక్తికలిగి, వెనక్కిడితే గొయ్యి, ముందుకొస్తే నుయ్యి మాదిరిగా ఉంటుంది. అంతకంటె దుఃఖమయజీవితం యింకొకటి లేదనిపిస్తుంది. వారి జీవితం నిరర్థకమవుతుంది. మానవజీవితంలోని ముఖ్యాశయాలు నెరవేరవు. సంఘం ఏవిధంగానూ బాగుపడదు. కాబట్టే ఒకరినొకరు బాగా అర్థంచేసుకోవాలి. దాన్నే ప్రేమించుకోవడమంటారు.

మనస్ఫూర్తిగా ఒక స్త్రీ, ఒక పురుషుడు ప్రేమించుకొంటే, ఒకరియందు ఒకరికి పూర్తినమ్మకముంటే పెళ్ళిగూడా అనవసరమని చెప్పొచ్చు కాని, పెండ్లి ప్రయోజనకారి అయి, మానవుని జీవితాశయం నెరవేరాలంటే 'ప్రేమ', లేక, నమ్మకంతో కూడిన నిశ్చలానురాగం తప్పకుండా ఉండితీరాలి.

ఇంకో చిన్న విషయం - వధూవరులు మొట్టమొదటిసారి ఒకరినొకరు చూచుకొన్నప్పుడు, ఒకరిని గురించి ఒకరికి, అనుకూలాభిప్రాయమో, లేక, ప్రతికూలాభిప్రాయమో కలుగుతుంది. అదే మనస్సుకు గల సూక్ష్మగ్రహణశక్తి. అదే ఆజన్మాంతం వారి మనస్సులో నిలిచిపోతుంది. కాబట్టి, ఆ అభిప్రాయాన్ని కూడా కొంచం గమనించాలి.

నిజంగా ప్రేమించుకొని పెండ్లాడితే, విడాకులకుగాని, మారు మనువులకుగాని, పునర్వివాహాలకిగాని తావుండదు. ఉభయులూ బ్రతికిఉండగానే, కొంతమంది పునర్వివాహ ప్రయత్నాలు చేస్తున్నట్లు వినికిడి. కారణం పాఠకలోకానికే తెలుసును. వివాహంకాకుండా ప్రేమించుకోవడం, పరిచయం కలుగచేసుకోవడం తప్పా అంటే, ప్రస్తుత కాలమాన పరిస్థితుల్ని, ప్రపంచకపు రీతిని బట్టి పూర్వాచారం కాకపోయినా, దురాచారంమాత్రం కాదు.

'ప్రేమపెళ్లి' అనే మాటకు పెళ్లి అనే మిషతో వ్యభిచరించడం అనే అర్థాన్ని కొంతమంది తీశారు. అది అజ్ఞానాన్ని తెలియచేస్తుంది. పురుషునిమాట ఎట్లున్నా, స్త్రీ తన శీలాన్ని మనమనుకొన్నంత సులభంగా పోగొట్టుకోదు. ఆ శీలాన్ని కాపాడుకోవడమే ఆమె ప్రధానాశయంగా పెట్టుకుంటుంది. వ్యభిచారాన్నే వృత్తిగా పెట్టుకున్న యువతికూడా గత్యంతరం లేనప్పుడే తలపెడుతుంది. ఇట్టి దురాచారాలకి సంఘమే కారణమంటే తప్పుకాదు. ఆ స్వార్థంతో కూడిన సంఘనియమాలే వారినట్టి స్థితిలోనికి తీసుకువచ్చాయి. అట్టి అనాథలకు వేరువృత్తి కల్పించి, వారి జీవితాల్ని నిష్కళంకంగా చేసే బాధ్యత తోడిమానవులది.

'ప్రేమపెళ్లిళ్లు' సుఖవంతంగా పరిణమించడానికి బాలబాలికల బాధ్యత ఎక్కువగా ఉంది. అంతకు ఏమాత్రమో తక్కువగా తల్లిదండ్రులు, లేక, సంరక్షకులది.

పెండ్లి చేసుకొనబోయే యువతి, లేక, యువకుడు తగినంత ప్రపంచజ్ఞానము కలిగిఉండాలి. ప్రపంచజ్ఞానమంటే పుస్తకాలు చదివితే వచ్చే మిడిమిడి జ్ఞానము కాదు. నిత్యం ప్రపంచంలో జరుగుతూన్న విషయాలను గమనిస్తూ, వాటిలో ఏవి లాభదాయకములో, ఏవి అనర్థదాయకములో గ్రహించాలి. అందులో ఏవి మన నైతికవర్తనానికి, భౌతికశరీరానికి, మన జీవితాశయాలకి, ఏమాత్రముకూడా కష్టనష్టాలను కలిగించవో, వాటినే అనుసరించాలి. దీనికి ఎక్కువ ఓర్పు, విచక్షణాజ్ఞానము అవసరం. అవి పిల్లలకెలా బోధపడతాయా అని సందేహం కలుగుతుంది. కాబట్టే, బాల్యవివాహాలని పూర్తిగా మానివేయాలి.

యువకుని బాధ్యత ఎంతవరకో యోచిద్దాం. తన స్థితిగతులకు, తన గుణాలకు అనుగుణ్యమైన యువతినే ఎన్నుకోవాలి. అందని పండ్లకై అర్రులు చాపినందువల్ల లాభంలేదు. ఎన్నుకొని వివాహమాడినంత మాత్రాన, ఆతని బాధ్యత తీరిపోలేదు. ఆమెయందు నమ్మకముంచి, ఆమె కష్టసుఖాలని గమనిస్తూ, ఏ విషయంలోనూ మోసపుచ్చక, సంసార నిర్వహణభారంలో ఆమెకు సమభాగాన్ని యిస్తూ, తన మనో

నిశ్చలతను ఆమెకు వెల్లడిచేస్తూ, సంసారాన్ని ఆనందమయంగా చెయ్యాలి. అంతేకాని, యౌవనోద్రేకం వల్ల సంసారసుఖాన్ని కొంతకాలం అనుభవించి, తరువాత విరక్తి చెందకూడదు. అందువల్ల తనకే కాదు, తన వంశానికి, తను మెలగుతూన్న సమాజానికీ తీరని కళంకం ఏర్పడుతుంది. ప్రతివారు తమ ప్రవర్తనయందు నమ్మకము, అది మంచిగా ఉండాలనే పట్టుదల కలిగిఉన్నట్లైతే, సంఘంలో ఈనాడు జరుగుతున్న అవినీతి తదితర దురాచారాలు పూర్తిగా మాసిపోవడానికి అవకాశముంది. ఈ సూత్రాల్నే, ఈ నీతుల్నే తమ తరువాతివారికికూడా బోధించడం తమ విధిగా గ్రహించాలి.

యువతి విషయంలో—మొదట్లో ఒక యువకుని వివాహమాడి, తరువాత, తానుచేసిన పనికి పశ్చాత్తాపపడటంకన్న అవివేకం యింకొకటిలేదు. భర్తకు అన్నివిధాలా ఆనందాన్ని సమకూర్చడమే ప్రధానోద్దేశంగా తీసుకోవాలి. భర్త కేవైనా దురలవాట్లు ఉంటే, వాటిని మంచిచేతనే మాన్పడానికి ప్రయత్నించాలి. ఏ విధంగాచేస్తే, సంసారం శాంతియుతంగా ఆనందంగా ఉంటుందో, యోచించి, ఆ ప్రకారం నడచుకోవడం స్త్రీ ధర్మం.

తరువాత పెద్దలబాధ్యత—తమపిల్లలకు విద్యనేర్పడం మొదటి కర్తవ్యం. విద్యఅంటే 'గుడ్డెద్దు చేల్లో పడినట్లు', 'గుఱ్ఱమునకు కాళ్లు నాలుగు, చెవులు రెండు' అన్నట్లుగా కాదు. నేటి ప్రపంచంలో ప్రస్తుత ఆచారాలవల్ల కలుగుతోన్న లాభ నష్టాలు, వాటిలో ఏవి అనుసరింపదగినవో, ఏవి విసర్జింపదగినవో చెప్పాలి. లోకం పోకడలగురించి వారికి బాగా బోధించాలి. వాళ్ల కర్తవ్యాన్ని నిరూపించాలి. ఇట్లా చేసిననాడుకాని, తమ బాధ్యతను తీర్చుకొన్నవారు కారు. ఇట్లుచేసినా, యువతీ యువకుల జీవితం కష్టాల పాలైతే, అది వారి దురదృష్టమే.

ఇంకో విషయం—భార్యాభర్తలమధ్య చిన్న చిన్న కలతలు, ఎప్పుడైనా విరక్తి, దానిఫలితంగా ఎడమొగాలూ పెడమొగాలూ ఏర్పడవచ్చును. అది మానవప్రకృతి. అట్టివాటికి ఓ చిన్న గోసాయి చిట్కా వుంది. ఇద్దరిలో ఎవరు మార్గంతప్పి, ప్రవర్తిస్తారో వారిని రెండోవారు ఆదరించి, ప్రేమిస్తూ, వారి సుఖానికై ఎక్కువ పాటుపడుతూ, మొదటివారి మనస్సును ఆకర్షించినట్లైతే, పశ్చాత్తాపంపడి, వారు తప్పకుండా మంచిదారిలోకి వస్తారు. తెలివితక్కువచేత, తొందరపడి, అధోగతికి పాల్పడిన స్త్రీ పురుషులు కూడా యీ చికిత్సవల్ల సరియైన మార్గంలోకి వస్తారు. ఇదివరకుకన్న ప్రేమానురాగాలు ఎక్కువౌతాయి.

ఇట్టి చికిత్సకు 'ప్రేమ', 'ఓర్పు' ఉండాలి. ఈ రెండు మాటలకు అర్థం, భార్యకాబోయే బాలికకు బోధపడాలీ అంటే, 'అష్టవర్షా భవేత్కన్యా......' అన్న "వేదకాలపు" సూత్రాన్ని ఇప్పటి కాలానికి అనుగుణ్యంగా మార్చవలసి ఉంటుంది. ఇట్టివారి సంఖ్యనుబట్టే భారతదేశపు భావి ఔన్నత్యము ఆధారపడియుంది. ఇది ప్రతి భారతీయుడూ, ఆడ, మొగ - అన్న విచక్షతలేకుండా, ఆచరణలోపెట్టాలి.

ఇంతేకాదు. ఇంకో ముఖ్యవిషయంకూడా జ్ఞాపకముంచుకోవాలి. ఎప్పటికైనా ప్రేమానురాగాలే జయిస్తాయి. అవే మానవుని సుఖజీవనానికి కారణాలౌతాయి. 'ప్రేమే దైవము, దైవమే ప్రేమ' అన్న మాటను తలచుకొంటూ ఉండాలి.

# ఆంధ్రమాత

శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు

ఆంధ్రమాత నమస్సులు యావదాంధ్రరాష్ట్రనిర్మాణ కార్య స్వరాజ్య రథము
తెచ్చినా మధిష్ఠింపగా తేరునెక్కి నవ శుభోదయ మానట్లు నడుపుమమ్మ
రాజరాజనరేంద్రురాణివై కులికినదాన నిల్చైతంచు దలచి తలచి
కృష్ణరాయ మహీశు కేలూదినట్టి నా వైభవమేదంచు వనరి వనరి
కాకతీయులనాటి ఖడ్గధారను దృప్తి బొందినదేదంచు బొక్కి పొక్కి
రెడ్డిరాజుల బాహురేఖనడంగిన భాగ్యమేమయెనంచు బడలి బడలి.
సర్వ సర్వంసహాంధ్రరాష్ట్రాధిపత్య మెల్ల బోయెను నిక వచ్చునెల్ల కల్ల
యనుచు రోదించెదెందుకో యమ్మ వినుము కర్మవీరులు యాంధ్రులేం గన్నతల్లి.

తల్లివటంచు నిన్నెఱుకదక్కయె యుండిరి ఇంతదనక నీ
పిల్లలు భారతాంబ నిను బిల్చిరి కంఠములెత్తి యో మహా
తల్లియటంచు నాంధ్రవసుధారమ యంచును నేడు మాత నీ
చల్లని ప్రేమతత్త్వమున చక్కగ జూడుము ఆత్మసంతతిన్.

భారతమాత నీ భావంబుదెలిపెడి పంచమవేదంబు వ్రాయలేదు
కన్నతల్లీ భవత్కనకగర్భంబున గౌతమీ కృష్ణలు గలుగలేదు
మాతృదేవీ నీదు మహిమదెలిపెడి యాంధ్రనగర శిల్పంబింక నలుగలేదు
రాష్ట్రాంధ్రజనని నీ రత్నాల పుత్రులు ధైర్యసాహసముల దాచలేదు
ఎందుకింకను సంకోచ మింకనైన పోయినట్టి వారలపైన మోహముడిగి
ఉన్నవారల తోడనే నోరిమిమెయి సంతసంబున కాలంబు జరుపుమమ్మ.

ప్రాక్తన కర్మసంఘటన ప్రాప్తమునైనది పుణ్యవాసనల్
దిక్తట రేఖలందడగి తేజము కుంచుకపోవజొచ్చె నా
సక్తిని నాంధ్ర పుత్రులము జంకక నడ్మకు కాశగట్టి మా
శక్తిని ధారవోసెదము సంశయమందకుమింక మాతరో.

బంగరుతల్లి నీకు గొలుచుభాగ్యము నబ్బెను యాంధ్రపుత్రకుల్
చెంగటనున్న పెన్నిధిని చేవయెరుంగక నాదమర్చి త
క్కంగలకార్యమగ్నులయి కుందిరి వందిరి ఆయె పోయె నీకు
చెంగులుజాపి వేడెదరు చేరగదీయుము యాంధ్రరాష్ట్రమా.

ఆంధ్రభూమిని గృహలక్ష్మి లాదరమున, స్వాగతంబిదె నీకు సుస్వాగతంబు
నిచ్చి, నివ్వాళిబట్టిరి సచ్చరిత్ర అందుకొని వేగ రమ్మ నీవాంధ్రదేవి
కవులు నమృతాక్షరంబుల కావ్యసృష్టిజేసి రసతృష్ణ దీర్చిరి శ్రీలు పొంగ
వడి వడిగ నీదు పుత్రులకడకువచ్చి ప్రేమదుగ్ధమ్మొలిమ్మ సంప్రీతి మాత.

# రాజేశ్వరి

శ్రీ బూర్గుల రంగనాథరావుగారు

ఉత్తరం చూడగానే రాజేశ్వరికి కళ్లనీళ్లు తిరిగాయి. 'ఎక్కణ్ణుంచి' అని హాల్లో మూగిఉన్న మిత్రులు అడిగినా చెప్పక, కిటికీలోనుంచి వీధిలోకి చూస్తున్నట్టు నటించి, కళ్లనీళ్లు తుడుచుకుని, విచారాన్నంతా బలవంతంగా మింగేసి, చిరునవ్వు తెచ్చుకుని, స్నేహితులతో 'ఈరోజు నేను మా అప్పయింటికెళ్లాలె. సాయంత్రం బహుశా మనం కలుసుకోలేమేమో!' అంది.

'మళ్లీ యెప్పుడు దర్శనం?'

'మీరిప్పుడు వెళ్లక తప్పదా?'

'పిక్చరు ప్రోగ్రాం వేశాంగా?'

'సరె! మీ యిష్టం.'

ఈ ప్రశ్నలన్నిటికీ 'టీ తాగి వెళ్లండి' అని మాత్రం జవాబు. టీ తాగి ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. ప్రకాశం కొంచెం అందరికన్నా ఆలస్యంచేసి, 'నా కారులో దిగబెడతాను' అన్నాడు.

'అక్కర్లేదు... థాంక్స్... దయదలిస్తే కారు వదిలి వెళ్లండి. రేపు ప్రొద్దున్నే...' నోరుతెరిస్తే చాలు ఏదంటే అది చేసే ప్రకాశం అర్ధోక్తిలోనే, 'పరవాలేదు; తీసుకెళ్లండి' అని మందహాసంతో ఆశాపూరితమైన నమస్కారంచేసి వెళ్లిపొయ్యాడు. అమావాస్య చంద్రుణ్ణి వదిలివెళ్లిన నక్షత్రాల్లా మిత్రులందరూ వెళ్లాక, వేగుచుక్క ప్రకాశం గూడా కదలిపోయాడు.

ఇంకెవరూ తనను వేధించకుండా రాజేశ్వరి తలుపేసి, సోఫాలో పడుకొని మళ్లీ ఓమారు ఉత్తరం చదువుకుంది. ఉత్తరంకన్న, ఉత్తరాన్ని వ్రాసిన రమాకాంతం పేరు ఆమె ఊహాధునికి ఆవేగం కలిగించింది. కాలేజిరోజులు కలలో మెదిలినట్టు కనులకు కట్టాయి. ఇంకొకప్పుడైతే యిదే ఉత్తరాన్ని పదిమార్లు— కాని అసహ్యదృష్టితో అపహాస్యంకోసం—చదివేదేమో కాని యిప్పటి తనస్నేహితుల వైఖరి, తనకు జరుగుతున్న కృత్రిమ సన్మానాలు, దుర్భరమైన ఈ నాలుగేళ్ళ జీవితంలో తానుచేసిన ఘోరాలు, ఈ ఉత్తరంచే పెల్లగింపబడి, త్రవ్వితీసిన తలపుల్లలవలె జుగుప్సాకరంగా దుర్భరంగా కనపడ్డాయి. రమాకాంతంయొక్క ఏకాగ్రత, ప్రేమ, తనపై ఆశ, ముఖ్యంగా అతని చిన్నయీడు గొప్పహృదయం, ఆమెలో ఒకవిధమైన మానసిక విప్లవం కలిగించాయి.............

ఎంత వద్దన్నా ఆ కాలేజి రోజులు, అప్పటి చర్యలు జ్ఞాపకం వస్తున్నాయి. తన పార్టీలో ఓ అరడజను స్నేహితులు; స్త్రీలు - పురుషులు. అందరూ ధనవంతులూ రూపవంతులే. అంతా తనను ఆరాధించి 'ప్రేమించి' పొగడేవాళ్లే! ప్రతివాడూ 'నమస్కారమండీ' అని ఓ మందహాసపుష్పం అర్పించుకోవడమే...ఇదంతా యెందుకని? తనకు అందం, తెలివి ఉన్నాయి గనక! క్లాసులో అగ్రస్థానం తనకే!

బహుమానాలు, సన్మానపత్రాలు, విందులూ, పూలహారాలు అన్నీ తనకే!! కాని తానుమాత్రం ధనవంతులైన ఏ కొద్దిమందితోనో యెక్కువగా తిరగడం, వాళ్ళ కార్లల్లో, సోఫాలల్లో తన సౌందర్యాన్ని రాచివేయడం......మరి రమాకాంతం యేంచేశాడు? తమంతా కలిసి పోతూంటే, ఎక్కడో ఫర్లాంగు దూరాన్నుంచి జాలిగా అనుసరిస్తూ దీనదృష్టుల్తో, తెగిపోయిన గాలిపటాన్ని అనుసరించే వీధికుఱ్ఱాడిలాగ, తిరిగేవాడు. ఒక్కమారైనా - 'స్త్రీ హృదయం'తో కాకపోతే మానవహృదయంలోనైనా అతడిని చూసిందా?...

'ఇప్పుడు అసలు తనను ఎవరైనా ప్రేమిస్తున్నారా?' అంటే, తన హృదయంలోనుంచి 'లేదు! అంతా దుర్మార్గులు! అప్పుడు విద్యార్థులు, యువకులు. ఇప్పుడు ఉద్యోగులు, గృహస్థులు. తనలో యింకా యేమయినా యవ్వనం, సౌందర్యం ఉంటే పీల్చేసి ఎన్నటికైనా పవిత్రప్రేమకొఱకు వీటిని దక్కకుండా చేతామని వచ్చేవాళ్లే' అని బదులు వస్తుంది.

తనభర్త యెక్కడో పిచ్చివాడై వ్యర్థుడై పడిఉన్నాడు—ఏదో దుర్విధివల్ల అలాంటి చిన్నతనపు 'వివాహం' జరిగింది. కాని కొన్ని పరిస్థితులు తనను పట్నం కొట్టుకొచ్చాయి. తండ్రీ మామగారు పశ్చాత్తాపపడి కళ్లుతెరచి యిప్పటికైనా మునిగిపోలేదని ఉన్నతవిద్య చెప్పించారు. ఇంట్లో ఉంచుకుని చదువుచెప్పించిన తన మేనమామ పోగానే డబ్బున్న స్నేహితుల సహాయంమీద స్వేచ్ఛగా ఉండిపోయింది. బంధువులందరినీ యెదిరించి, ఒక్కడూ వివాహం చేసుకోడు. అందరికీ 'లీగల్ ఆబ్జక్షనే'.

కాని యిప్పటికీ తరగకుండా మరవకుండా ప్రేమించిన రమాకాంతంలాటి మనిషి—కాదు; ప్రాణం ఉన్నమనిషికన్న నిశ్చలంగా నిర్మలంగా ఉన్న పర్వతం—తనకు యెక్కడ దొరుకుతుంది?

నిశ్చయించుకుంది; అప్పుడే ప్రయాణానికి ప్రకాశంకార్లో. ఒక దాసీదాన్నిమాత్రం వెంట తీసుకుని స్వయంగా డ్రైవ్ చేసుకుంటూ బయలుదేరింది, పాకాల తాలూకాలోని రమాకాంతం గ్రామానికి. ఈగ్రామానికి నాలుగుమైళ్ల దూరంలో ఉన్న రామప్పగుళ్ల ముందరికి రాగానే రాజేశ్వరి హృదయంలో ఒక మెరుపుమెరిసింది. అది పశ్చాత్తాప మేఘాల రాపిడివల్లనే కావచ్చు. లేదా దుఃఖోద్రేక ఫలితమే కావచ్చు. లేదా, నమ్మితే, ఆధ్యాత్మిక సంచలనం అనవచ్చు. ఆ గుళ్లయొక్క పురాతన శిల్పసౌందర్యం, దివ్యమైన గాంభీర్య పవిత్రతలు అవేవో నిశ్శబ్దంగా ప్రతిధ్వనించాయి...కారు ఆపింది. శుభ్రంగా ప్రక్కన ఉన్న చిన్న చెరువులో స్నానంచేసి తెల్లచీరకట్టుకుంది—ఆమె పిచ్చికాకపోతే, చలువచీరైనా నీళ్లలో పిండి కట్టుకోవడమెందుకు? మడికోరకేమో?—చెవులకు ఆ పొడుగుపాటి లోలకులులేవు. కాళ్లకు ఎత్తు మడిమల జోళ్లు లేవు. పౌడరు, రూజ్, లిప్‌స్టిక్, ఏవీలేవు. మెళ్లో ఒకేవరుస చౌకరకపు ముత్యాలహారం (తండ్రి కొనిచ్చింది పెళ్లికాక పూర్వం) ఉంది. అదొక్కటే తనది, అమాయకంగా వచ్చింది. స్వయంగా గన్నేరుపూలు కొన్ని పట్టుకొని ఒక గుడిలోకివెళ్లింది. ఆ రాళ్లకూ అస్పష్టంగా ఆడుకుంటున్న ఆలలకూ, తలపై యెగిరిపోయే రాబందులకు, రాజేశ్వరి వైఖరి యెంత అర్థమాతుందో ఆ దాసీదానికీ అంతే అర్థమైంది. 'మాట్లాడకుండా వెళ్లి కార్లో కూర్చో' అని చెప్పే రాజేశ్వరి చూపులను తెలిసికోక, 'ఏం ఖర్మం? పిచ్చెత్తిందా?' అనుకుని, అడుగులో అడుగువేసుకుంటూ అర్ధనిమీలిత నేత్రాలతో మౌనంగా ప్రార్థనచేస్తూ నడుస్తున్న ఆమెవెనకాలే, తానూ నడిచింది దాసీది. క్షణంలో రాతివిగ్రహం ముందర రాజేశ్వరి విగ్రహం

నిలుచుంది. దేనికేది ప్రతిబింబమో? రెంటి శిల్పం ఒకేతీరుగా ఉంది. అయితే విగ్రహం నల్లరాయి. ఈమె శరీరం వెన్నెలపోగు. ఈమె కళ్లుమూసుకుంది ధ్యానంలో. విగ్రహం కళ్లుతెరచింది. ధ్యానాన్ని అభినందిస్తున్నట్టుగా ఉంది. 'ఈమెను సృష్టించిన ప్రకృతి చాతుర్యం, ఆ రాతిని చెక్కిన వడ్డెవాని శిల్ప విద్యా ప్రౌఢి ఒకేతీరుగ యెలా ఉన్నా' యంటే, అదే 'శిల్పం' అని అనవల్సివస్తుంది. నాల్గో క్లాసులో చదివి మరచిన చంద్రమతి, దమయంతి, సావిత్రి మొదలగువారి కథలు సద్యః స్ఫురణలు (Sudden Revelation)గా పొడసూపాయేమో కాని, ఆమె భావాలు, వేషం, తెల్లచీరమీద నమ్రతతో వంగిఉన్న నల్లని వెంట్రుకలూ, అన్నీ పవిత్రాలు ప్రతిబింబాలుగా ఉన్నాయి. ఆమెలోని ఉచితజ్ఞత, పరివర్తన రమాకాంతుని పదపద్మం వద్దకే ఈడ్చుకపోయాయి.

రాజేశ్వరి యెంతసేపు ధ్యానించిందో కాని విగ్రహంపాదాలు పట్టుక పడిపోయింది... అరగంట గంట అయింది, లేవదు. సూర్యాస్తమయం కావస్తున్నది. దాసీది భయంచే వణికిపోయింది. ఊళ్లోకి వెళ్తే? ఒక్కర్తే రాజేశ్వరిని ఈ స్థితిలో విడిచి ఎట్లా వెళ్లుతుంది? వెళ్లకుంటే ఎంతసేపో మూర్ఛ... ఇంకేమైనా అయితే? వైద్యుడు, ఏమైనాతిండికి సహాయం, కావాలె... పరిగెత్తింది ఊరివైపు.

అదే సమయానికి...

వచ్చేస్తున్నాడు అడవికి, రమాకాంతం, ఒక్కమారు పట్నంవెళ్లి రాజేశ్వరిని మనసారాచూసి వీలైతే మాట్లాడి తరువాత తన నిశ్చయాన్ని పూర్తిచేసుకోవాలని. దాసీది యెవరో సహాయానికి సమయానికి కనుపడ్డారుగదా అని అడిగింది 'ఈ ఊళ్లో వైద్యునియిల్లు యెక్కడుంది స్వామీ?'

'ఆ సర్వేశ్వరుడే పెద్ద వైద్యుడు' అంటూ ముందుకు పోసాగాడు.

'అయ్యా త్వరగాచెప్పండి. ఏమైనా సహాయంచెయ్యండి. ఇక్కడ మా దొరసాని గుళ్లో పడి పోయింది' అని అతన్ని అర్థంచేసుకునే ప్రయత్నం చెయ్యకే తిరిగి ప్రశ్నించింది.

'ఈ దొరసాన్ల కింతేకావాలి'. నిలువకుండా చర చర వెళ్లాడు.

ఊరివైపు వెళ్లిందామె ఆశ్చర్యంతో యితనివైపు చూస్తూ. కొంచెము ముందుకుపొయ్యాక రమాకాంతంకు రోడ్డుమీద కారు కనుపడింది. ఆ కారు ప్రకాశందని తాను బాగా యెరుగును. అంతాకలిసి యిక్కడికే పిక్నిక్కి వచ్చారో? కాని తోవలో తనకు కనుపడిన వ్యక్తి 'గుళ్లో పడిపోయిం'దని యెందుకు చెప్పుతుంది? గుడిలోకి వెళ్లాడు. ప్రశాంతమయిన ముకుళిత నయనాలమీది విచారచ్ఛాయలనుగాని, మెడను కప్పేసిన జుట్టునుకాని చూడలేదు. భక్తిని, అమోఘమైన పరివర్తననూ, సూచించే ఒక తెల్లని ఆకారం మాత్రం మొదట కనుపడింది. అంతా అర్థమయిందతనికి. వెంటనే విగ్రహానికి నమస్కరించి, తరువాత తన జీవనాధారమైన రాజేశ్వరీ మూర్తికి ప్రణమిల్లాడు.

మెల్లగా ఆమెకళ్లను స్పృశిస్తూ 'రాజా' అన్నాడు రెండుమార్లు. ఊపిరి కొట్టుకుంటూనేఉంది. ఎలాగో చెరువు అంచుకు యెత్తుక పొయ్యాడామెను. దిగిపోతున్న సూర్యబింబం ఒక్కమా రామె పాదాలను తాకి పూర్తిగా మునిగిపోయింది. మలుసంజ అరుణరాగం మాత్రం మందమారుతానికి, యిష్టంఉండీ లేక

దొర్లే చిరుతరంగాలను చక్కిలిగింతలు పెడుతూ ఉంది. తెలివివచ్చేదానికి మొఖంమీద నీళ్లు చల్లడానికని కిందపడుకోబెట్టబోయి ఆమెను కిందపడేశాడు. అందమయిన అవయవాలు బరువుగా ఉంటాయని ఆ అబ్బాయి అనుకోలేదేమో! ఎడమచేయి భారం యెక్కువైంది. కుడిచేయిమీద ఆమెతల ఉంది. అంచేత యెత్తివేసినట్టయింది. ఆమె మెలకువకు అదేకారణం. కళ్లువిప్పి చూసింది. రాతివిగ్రహంబదులు తన రమాకాంతం దగ్గిర కూర్చున్నాడు, చల్లనీళ్లతో తనమొహాన్ని తడుపుతూ...ఇద్దరూ ఉద్రిక్తులైయున్నారు. ఎవరు ఎవరిని ఎట్లాఅన్నా ఏమనుకుంటారో అనే అనుమానధూళి వారి నాశ్రయించలేదు; ఎట్లా సంబోధించాలనే శబ్దాన్వేషణంలేదు. ఆపనంతా వాళ్లచేతులు, కళ్లు, పెదవులే చేశాయి.

‘ఇంకోమారు ప్రార్థనచేసి వెళ్దామా?’ అంది రాజేశ్వరి.

‘తప్పకుండా...నీతోకూడా ప్రార్థించి తరిస్తాను.’

.......................................................................................................

ఇద్దరూ పరితృప్తహృదయులై పెదవులమీద చిరునవ్వు మొలకలెత్తగా, కళ్లల్లో దివ్యానందం చిందులాడగా, కార్లోయెక్కి కూర్చున్నారు. కారును ఊళ్లోకి పోనిచ్చింది. ఊరిబయట తనకోసం వైద్యుని తీసుకునివస్తున్న దాసీదాన్ని వైద్యుణ్ణి కూడా పిక్ అప్ చేస్తూ రమాకాంతుని ‘అమృతనివాస్’లోకి వెళ్లారు.

ఒకప్పుడు ఆరిస్టోక్రాటిక్ రాజేశ్వరి యిప్పుడు తన ఉన్నతవిద్యను సద్వినియోగం చేస్తూ ఆ ఊరికి సర్వవిధాల సేవచేస్తూన్నదని చెప్పడం అనవసరం.

అక్కడ ప్రకాశం ‘ఎక్కడో సుఖంగా ఉండనీ. కాని పాపం కారును తిరిగిపంపక తనవద్దనే ఉంచుకొని ఉంటే బావుండేది’అని అనుకున్నాడు, కొంచెం ఫీల్ అవుతూ.

---

# స్త్రీ హితైషిణీమండలి, బాపట్ల

## భవన శంఖుస్థాపనము

స్త్రీ హితైషిణీమండలి భవన శంఖుస్థాపనము 7-11-41 తేదీ శుక్రవారం అత్యంత వైభవోపేతముగా జరుపబడినది.

ప్రథమమున యథాశాస్త్రీయముగా వాస్తుపూజాక్రమముగా జరిగిన తరువాత ఈ పురమునందలి సబ్ జడ్జిగారగు మహారాజశ్రీ ఘూడభూషి రంగనాథాచార్యులవారి సతీమణియగు శ్రీమతి గుణవతీదేవిగారు వెండితాపీచే శంఖుస్థాపనము గావించి అచట సమావేశమైన స్త్రీల నుద్దేశించి స్త్రీ సమాజములకు భవన ముండినగాని అభివృద్ధినందుట కవకాశములేదనియు ఈ స్త్రీ హితైషిణీమండలివారు స్త్రీ సంఘమునకు చేయుచున్న సేవ అనిర్వచనీయమనియు మీరెల్లరు ఈ భవన నిర్మాణ కార్యమునకు తోడ్పడి అనతికాలములో భవనము తయారగునట్లు చూడవలెననియు చెప్పిరి. పిమ్మట శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మండలి చరిత్రను వివరించి భవన నిర్మాణమునకు ఎల్లరు సహాయ మొనర్పవలెనని కోరిరి. శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారి వందనములతో సభ సమాప్తమయ్యెను.

# కీర్తిశేషులు నాగపూడి కుప్పుస్వామయ్యగారు

సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులును సాహిత్య విమర్శకాగ్రేసరులు నగు శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు తమ 77-వ యేట బెంగుళూరున మృతినొందిరి. వీరి కుమారులు న్యాయమూర్తి చంద్రశేఖరయ్యగారు మదరాసు హైకోర్టు జడ్జిపదవి నందుకొన్న సంతోషవార్తను వినిన తరువాతనే ఈ ధన్యజీవి ఇహలోకమును వీడెను.



కీర్తిశేషులు నాగపూడి కుప్పుస్వామయ్యగారు

మరణము 29-10-1941

కుప్పుస్వామయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయమున చాలకాలము బోర్డు ఆఫ్ స్టడీస్ (తెలుగు శాఖ) మెంబరుగను, ఆంధ్రభాషా పరీక్షకులుగను, ఆంధ్ర పాఠ్యగ్రంథ నిర్ణయ సంఘసభ్యులుగను ఉండి మంచిసేవ చేసిరి.

అంతకుముందు వీరు తమ స్వస్థలమగు తిరుపతియందు ప్లీడరుగ నుండి మంచి పేరు గడించిరి.

కొంతకాలము వీరు ఉపాధ్యాయులుగకూడ నుండిరి.

వీరు అనేక రచనలుచేసి ప్రకటించియుండిరి. వానిలో, ముక్కుతిమ్మన వ్రాసిన పారిజాతాపహరణమునకు వీరు చేసిన 'పరిమళోల్లాసము' అను వ్యాఖ్య ప్రసిద్ధమయినది. భారతసారము, భోజరాజీయము అను వచన గ్రంథములను రచియించిరి.

గద్యపద్యరచనలందు వీరి శైలి సరళము, హృదయంగమము. సంస్కృతమున వీరు రచించిన స్తోత్రగ్రంథములందు 'స్తవరత్నావళి' పేరుపొందినది. ధన్యమణిహారమనునది చాలా మనోహరమైనది. శ్రీ కాళహస్తీశ్వర శతకమును వీరి భక్తిపూర్ణ రచనమును ప్రసిద్ధమైనదే.

కుప్పుస్వామయ్యగారు రామాయణ, భారత, భాగవతాది మహద్గ్రంథములను ఆమూలాగ్రముగ చదివిన పండితులగుటయే కాక, వానికి పాశ్చాత్య సాహిత్యవిమర్శన పద్ధతిని పీఠికలను వ్రాసి ప్రకటింపజేసిన సారస్వత సేవకోత్తములు. సరసమైనట్టియు, పటుత్వము గలిగినట్టియు మంచి గ్రాంథికభాషలో వీరి రచనలు నిర్దుష్టముగ నుండును.

ఈ అసమాన కవిపండితునకు కావ్య, నాటక, సంగీత, వేదాంతాది విద్యలయందు విశేష అభిమానము చక్కని ప్రవేశము నుండెను. హాయిగొల్పు చక్కని కంఠస్వరముతో వీరు సుశ్రావ్యముగ పద్యపఠనము చేయుచుండి, అనేకులకు ప్రియతములయిరి.

ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున కీర్తిశేషులు జయంతి రామయ్యపంతులుగారును, నాగపూడి కుప్పుస్వామయ్యగారును ఒకవిధముగ ఒకతరగతికి చెందిన cultured and classical gentlemen అనవచ్చును. కుప్పుస్వామయ్యగారు మంచి హృదయపూర్వకమైన హాస్యరసము (Humour) ను కలిగియుండి సంభాషణ చతురతతో ఏ యీడువారితోను, ఎట్టి సంఘములోను, ప్రీతిపాత్రులై వర్తిలుచుండుట మే మెరిగియుండిన విషయము.

కుప్పుస్వామయ్యగారికి స్త్రీల విద్యాభివృద్ధులయందును విశేష ఆదరాభిమానము లుండినవి. వీరివద్ద 'మనుమరాలు' వలె చనవుగ నుండి ప్రోత్సాహమును బడసి 'జ్ఞానప్రసూనాంబికా శతకము'ను హృద్యముగ రచియించిన విదుషీమణి శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ వీరిని ప్రశంసించుచు వ్రాసియుండిన మాటలను ఈ దిగువ పొందుపరచుచున్నాము:—

“లోకశంకరుండును, భక్తవశంకరుండును, కలిమలనాశంకరుండునగు శంకరునిపై నెందఱో మహాకవులు శతకంబులం జెప్పి కృతార్థులయియున్నారు. అట్టి శతకములలో ధూర్జటికవికృత శ్రీ కాళహస్తీశ్వర శతకమును, ఆధునికులలో విమర్శకాగ్రేసర బ్ర|| వే|| నాగపూఁడి కుప్పుస్వామయ్యగారి కృతమగు శ్రీ కాళహస్తీశ్వర శతకమును సుప్రసిద్ధములై, యధికప్రచారమునందున్నయవి. ఏలకో నేటివరకెవ్వరును శ్రీ జ్ఞానప్రసూనాంబికపై నొక శతకమును జెప్పరైరి. అయ్యది నాపుణ్యమని తలంచి యీ శతకమును నా శక్తికొలంది రచించి, శ్రీ జ్ఞానప్రసూనాంబికా తరుణారుణచరణ సరోజంబుల కర్పించుచున్నదానను.

ఈ శతకమును దిద్ది యొసంగుడని విమర్శకాగ్రేసర బిరుదాంకితులగు బ్ర|| వే|| నాగపూఁడి కుప్పుస్వామయ్యగారిని ప్రార్థించితిని. బాల్యమున వీరి మనుమరాండ్రతో నాడుకొనుచు వారిలో నొకర్తెనుగఁ బెరిగియుండుటచేతను, వారిచే 'నా యనుంగు మన్మరాలని' సంబోధింపఁబడుటచేతను, వారు మాకందఱకుఁ గురువులగుటచేతను, వారే దీనిని సవరించి యొసంగవలయునని వారి పాదపద్మములకెఱఁగి విన్నవించుకొంటిని. మా 'తాత'గారికి నాయందుగల వాత్సల్యముచే, వయోవృద్ధులయ్యు ముదిమినగు శ్రమకోర్చి, యోపికతో నిద్దానిని సవరించిరి.”



# భారతదేశం - జ్యోతిర్మయ ప్రభాతమ్

శ్రీమతి వల్లభనేని రంగాదేవి

ప్రపంచమంతా అంధకారభూయిష్టముగ నున్నది. నిశాంధకారమును నక్షత్రములు నశింపజేయ జాలకున్నవి. చంద్రునికికూడా ఆ పూర్తి పవరు లేకున్నది. ఆ సామర్థ్యం, ఆ శక్తి, సూర్యభగవానునిలో యున్నది. అతనిని కన్నెత్తి తేరిపారచూడజాలరు.

భారతదేశం - శతాబ్దములనుండి పరాధీనముగా యున్నది. శతాబ్దములనుండికూడా భారత భాగ్యాకాశం నిబిడాంధకారాచ్ఛాదితమై యున్నది.

అచ్చటచ్చట - అప్పుడప్పుడు - ప్రకాశమానమైన తారలు గోచరిస్తున్నవి. కాని నక్షత్రాలవల్ల యెప్పుడైనా ఘోరాంధకారం దూరమైనదా?

కాలేజీలనుండి చాలమంది యువకులు B. A., M. A. డిగ్రీలు పొందుచున్నారు. వెంటనే - బయట కాలిడగనే-నౌకరీలకై కాకుల్లాగా తిరుగుచున్నారు. ఫలితం శూన్యం. శాంతిసుఖములు వారికి స్వప్నతుల్యములు.

రైతులు అహర్నిశలు పాటుపడ్డప్పటికీ ఉదరపోషణావకాశములకు ప్రాకులాడుచునే యున్నారు.

జామీందారుల జంగ్లీ చేష్టలు, శాసకుల అత్యాచారాలు, అర్థరహిత శిక్షాప్రణాళికలు, నిరుద్యోగుల శోచనీయ సమస్యలు, సాంఘిక విద్వేషాలు, రాజకీయ వైమనస్యాలు, లక్షోపలక్షల దరిద్ర మానవుల యార్తనాదములు, మూర్ఖసాధుల...

తమ వర్తమాన దురవస్థనుండి విముక్తిబొందుటకై, నేటి భారతీయ మానవజాతి నానావిధ యత్నముల జేయుచున్నది. భారత భవితవ్యం కొందరు 'కారల్ మార్క్సు' సిద్ధాంతములపై నిర్మించాలంటే, కొందరు 'ప్రిన్సు క్రపాట్‌కన్' సిద్ధాంతములపైనైతేనే శ్రేయస్కరమంటున్నారు. కొందరు శస్త్ర సహిత విప్లవం కావాలంటూంటే, కొందరు మహాత్మాగాంధిగారి అహింసాత్మ కాందోళనే అవలంబనీయ మంటున్నారు. అందరి లక్ష్యం ఒక్కటే. అందరిధ్యేయం ఒక్కటే - అందరు భారతదేశముక్తినే గోరునది. భారతదేశమందు కోట్లకొలదిగనున్న పేదల కన్నవస్త్రములు కలగాలనే అందరూ కోరునది. అయినప్పటికీ అందరి త్రోవలూ వేరువేరు? కాని యేత్రోవ తొక్కిన శ్రేయస్కరమో?

రష్యా విప్లవాన్ని భారతదేశంలో అనుకరణచేయాలనుకునేవారు - ముందుగా - రష్యా భారత దేశాల పరిస్థితులు అవగతం చేసుకోవాలి. అయితే, భారతదేశం జారుచక్రవర్తులనాటి రష్యాకాదు. 1917-18 సంవత్సరములనాటి ఇటలీ జర్మనీలు అంతకుముందే కాదు!

భారతదేశ నవ్యజ్యోతిర్మయ ప్రభాతమ్ - ఇటలీదేశపు ఫాసిజముగాదు. జర్మనీదేశపు నేషనల్ సోషలిజమూగాదు. రష్యాదేశపు కమ్యూనిజముకూడ కాదు. యిది ఋషులదేశం. దార్శనికులదేశం. జూలియస్ సీజరుదేశంగాదు. సికందరు దేశంగాదు. భారతదేశానికొక స్వంత మార్గమున్నది. స్వతంత్ర పథమున్నది. భారతదేశం తన నవ్యజ్యోతిర్మయరూపములో, ప్రపంచమెదుట ప్రత్యక్షమైననాడు-ఆ పథభ్రష్టరాజ్యాలన్నీ (అశాంతి లోయున్న) విస్మయ-విహ్వల-విరాగత్వం జెంది-శ్రద్ధాభక్తిపూర్వకంగా నమస్కృతులర్పించును.

నూత్న సాహసశక్తులుగల భారతీయ నవయువకులు - ప్రపంచ మార్గదర్శకులగు నవయువకులు ఋషిపుంగవుల దేశమగు యీ పుణ్యభూమిలో గౌరవోజ్వల ప్రభాతాగమనము తొందరలో కలుగునని పరాధీన పారతంత్ర్య నాశనం తొందరలో అగునని - మంచుకొండపై చంచలమెరుగని ప్రాతః స్మరణీయ మహర్షుల 'సర్వేభవంతు సుఖినః సర్వేసంతు నిరామయాః మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్' అన్న పవిత్ర వాక్కులు తొందరలో సార్థకమగునని - నిరీక్షించుచున్నారు. కావున భారతదేశం ముందు బలీయం కావాలి. శక్తిసంపన్నం కావాలి. నిష్కామ కర్మయోగాశ్రయం తీసుకోవాలి.

# స్వీకారము

## శ్రీరామకృష్ణ వాక్యావళి

ద్వితీయ ముద్రణము. 540 పుటలు, క్రౌను సైజు. సాదా బైండ్, వెల రూ. 1-12-0; మేలైన అట్ట బైండ్ రూ. 2-4-0. చక్కని ముద్రణము.

పరమహంస సంగ్రహ జీవిత సహితము. ఇంచుమించు 80 నీతికథారత్నములతో గూడిన యీ గ్రంథమున 1121 మహోపదేశములు గలవు. మానవుని ఆత్మవికాస క్రమము ననుసరించు విధమున బోధ లిందు పొందుపరుపబడియున్నవి. భాగవతము, గీతలు మున్నగు గ్రంథములనుండి యిందు ప్రమాణవాక్యములు ఉదాహరింపబడియున్నవి.

## శ్రీరామకృష్ణ పరమహంస జీవితోపదేశ సంగ్రహము

పరమహంస జీవితమందలి ముఖ్య సంఘటనములన్నియు నిందు గలవు. వెల అ. 2½.

## శ్రీరామకృష్ణ పరమహంస నీతికథారత్నములు

వెల 0 6 0. ఇందు గల 62 నీతికథారత్నములును ఆధ్యాత్మిక నైతిక తత్త్వములను తేటతెలుగు మాటలలో సర్వజన సుబోధ మొనర్చుచున్నవి.

పై మూడు గ్రంథముల ప్రకాశకులు: చెన్నపురి శ్రీరామకృష్ణమఠమువారు. అనువాదకులు: శ్రీ మాధవ చైతన్య బ్రహ్మచారి.

## కుసుమావళి (పద్యాలు, గీతాలు)

రచయిత: ధరణికోట శ్రీరాం. ప్రకాశకులు: నాథం అండ్ మూర్తి, నెల్లూరు. ముద్రణము 1941. 64 పుటలు. వెల 12 అణాలు. ఇందులో 42 శీర్షికలున్నవి.

"కవిగానివాని వ్రాతలివి! మనోద్రేకంలో పొంగిన భావతరగలు మాత్రమె!" అని యువకుడు భావుకుడుఅగు రచయిత ముందుగా 'ఒక మాట' చెప్పుకున్నాడు వినయంగా. ఈ గ్రంథమందలి వివిధ రచనలద్వారా, భావావేశముగల ఈ యువకునియందు కవిహృదయ మున్నదని తెలియుచున్నది. ఈయన అభివృద్ధిని, జీవిత సాఫల్యమును కోరెదము.

## రీటా (హెయిర్ టానిక్)

వీటో మాన్యుఫాక్చరింగ్ కంపెనీవారు అభిప్రాయార్థము మచ్చుకు మాకు పంపిన "రీటా" అను హెయిర్ టానిక్ ఔన్సు సీసాను కృతజ్ఞతతో నందుకొంటిమి. దీనిగూర్చిన ప్రకటన "గృహలక్ష్మి"లో వేరొకచో కాననగును.

---

# స్త్రీల స్థానము

"భారత విజ్ఞానమునకు కుటుంబము మూలాధారము."

"తమ స్త్రీలకు భారతీయులు తగిన స్థాన మిచ్చుటలేదని కొందరనుచుండిరి. కాని, యిది నిజము కాదు. భారతదేశములో స్త్రీకి గొప్ప స్థానము కలదు. స్త్రీ గృహిణి, గృహమునకు రాణి. పురుషులు చేయవలసిన పని స్త్రీలు చేయవలె ననుట పొరపాటు."

"త్యాగము భారత విజ్ఞానమునందు గొప్ప స్థానము నలంకరించుచుండెను."

—సత్యమూర్తిగారు, బొంబాయి ఉపన్యాసంలో.

# చలనచిత్రముల సమీక్ష

## "తారుమారు" (తెలుగు)

జగన్నాథ్ ప్రొడక్షన్స్ ఎగ్మూరు మదరాసువారు తయారుజేసిన "తారుమారు" అను తెలుగు సాంసారిక హాస్యరస చిత్రము "వెలింగ్‌టన్" టాకీసులో ప్రీవ్యూగా చూపబడియుండెను. ఇదియొక ఆంగ్ల చిత్రమునకు అనుకరణము. కథా అవలంబనము సహజముగనే యున్నది.

తెలుగులో మంచి హాస్యచిత్రములుగాని, సైడ్‌షోసుకు తగిన చిన్న ఫిల్ములుగాని లేని కొరతను 'తారుమారు' తీర్చగలదు.

కొడవటిగంటి కుటుంబరావుగారు ఈ కథను మాటలను రచియించారు. వి. పరబ్రహ్మశాస్త్రి, డి. హేమలత గార్లు చాలా సహజముగ ఒప్పిదముగా నటించారు. ఈ ఫిల్ములో రెండుపాటలుగూడ యథాస్థానమున చేర్చబడియున్నవి.

ఈ టాకీ గమనము మాత్రము ఎందుచేతనో మందముగనున్నదని తోచినది. జగన్నాథ్ ప్రొడక్షన్ వారిదేయగు రాబోవు "బలేపెళ్లి" (మొక్కపాటి నరసింహశాస్త్రిగారి రచన) యింతకంటె బాగుండగలదని నమ్మకము.

## న్యూ థియేటర్సువారి "లగన్" (హిందీ)

ఈ చిత్రము ప్రీవ్యూ స్టార్ టాకీస్ హాల్లో జరిగినది. నితీన్‌బోసు డైరెక్షను, ఫోటోగ్రఫీ. ఆర్. సి. బోరాల్ సంగీతము. కానన్‌బాల, సైగల్, నవాబ్ మొదలైనవారు ప్రముఖపాత్రధారులు. సరే. కానన్‌బాల పాట, ఆట బాగున్నవి. సైగల్ పాటకంటె హాయిగొల్పునది ఏది? నవాబ్ అతిశ్రేష్ఠముగ నటించెను. ఛాయా చిత్రగ్రహణము, శబ్దగ్రహణము నిర్దుష్టములు. కథమాత్రము కన్విన్సింగుగా లేదు (నచ్చలేదు). భారతీయ సంప్రదాయమునకు తగని సాంఘిక సమస్యలను తెచ్చిపెట్టి చిత్రించుటయే యీ మధ్య న్యూ థియేటర్సువారికి పనియైపోయినట్లున్నది. కృతకముగా ఉండు కథలోని ఘట్టములతో సానుభూతి చూపగల్గి యుండుట సామాన్యపు సినీమా ప్రేక్షకునకు మించినపని.

## "సుభద్ర" (కన్నడము)

ఈ టాకీ యిపుడు మద్రాసు వెలింగ్‌టన్‌లో జరుగుచున్నది.

బాలాజీ గుబ్బి ఫిల్మ్సువారి ప్రథమ కన్నడ చిత్రము ఇది. దర్శకులు పి. పుల్లయ్యగారు బి.ఎ. ప్రధానపాత్రధారులు: జయమ్మ, హొన్నప్ప భాగవతర్, వినోదరత్నాకర జి. హెచ్. వీరన్న.

నాట్యముల ఏర్పాట్లు, కులకర్ణి శ్రీనివాస్.

అర్జునుని తీర్థయాత్ర, నాగలోకమున ఉలూపితో పరిచయము, తరువాత చిత్రాంగదతో వివాహము, చివరకు కపటసన్యాసి వేషమున సుభద్రాపహరణము, వివాహ విజయములను సంబంధించిన ఇతివృత్తము ఎట్టి మార్పులులేక తెరమీద చూపబడినది. విశేష వ్యయప్రయాసలతో కూడిన సెట్టింగులు అలంకారములు అమర్చబడినవి. మితిమీరిన యెన్నోపాటలు ఉన్నవి. ఒక్కొక్కప్పుడు కర్నాటకుల సంగీతము విసుగుకూడ పుట్టించెను. అర్జున పాత్రధారియగు భాగవతర్ గారి పాటలు పద్యములు కొంత భాగవతము కత్తులోనేయుండెను. నటన, భావప్రకటనము గూడ సినీమాలోవలెగాక నాటకరంగముమీదవలెనే తోచుచుండెను. గుబ్బివీరన్నగారు శుద్ధహాస్య నటుడన్న సంగతి వారి నాటకములు జూచినవారి కందరికిని తెలియును. ఈ చిత్రములో కళాసంపదకంటె ఛాందసప్రవృత్తి హెచ్చుగాయున్నను కథ పౌరాణికముగుటచేతను వీరపురుషుని ప్రేమవివాహ గాథలగుటను కన్నడులు విశేష సంగీత ప్రియులగుటవల్లను, పుల్లయ్యగారి దర్శకత్వము క్రింది యితర చిత్రములవలెనే యీ "సుభద్ర"కూడ బాగుగ ధనము సార్జించుకొనగలదని చెప్పుటకు ఎంత మాత్రము సందేహములేదు.



# సంపాదకీయము

**ఆంధ్రోత్సాహము - ఉత్సవములు - సభలు**

సుమారు ఒక నెలరోజుల లోపున ఆంధ్రదేశమునను, ఆంధ్రులు విశేషముగ నున్న కొన్ని యితర రాష్ట్రములలోను, మదరాసు రాజధానీనగరమునను విశేషముగ సభలు ఉత్సవములు జరిగినవి, జరుగుచున్నవి, జరుగనున్నవి. ఇది ఒక ఉత్సాహపు పొంగుగా, వెల్లువగా తోచుచున్నది. ఇన్ని సభల అవసరమో ప్రయోజనమో సందేహమునకు కారణము కావచ్చుననుకున్నను అదీ మంచిదే అని ఆశాపూరితముగ భావించుటకును వీలు ఉన్నది.

ఈమధ్య ఆంధ్రదేశపు వివిధజిల్లాలలోను మండల స్త్రీల సభలును జరిగినవి.

కాకినాడలో ఆంధ్రరాష్ట్రీయ మహిళా సమావేశము జరిగినది.

ఈ నెలాఖరులో కాకినాడలోనే అఖిలభారత మహిళామహాసభ జరుగనై యున్నది.

ఈమధ్య ఆంధ్రదేశములో విద్యార్థుల సభలు జరిగినవి.

మదరాసులో ఆంధ్రవిజ్ఞాన మహోత్సవము లను పేరుతో ఒక సప్తాహము జరిగినది. అది మద్రాసు ఆంధ్రవిద్యార్థులు, యువకులు ఏర్పాటుచేసినదే.

బొంబాయి ఆంధ్రసంఘమువారును తమ వార్షికోత్సవములను విశేష కార్యక్రమముతో జరిపినట్లున్నారు.

విశాఖపట్టణములో ఆంధ్రమహాసభలు, రాష్ట్రేతరాంధ్ర సమావేశమును జరిగినవి. విశాఖ ఆంధ్రమహాసభలో ఆంధ్రరాష్ట్రము గూర్చిన ఈ దిగువ ప్రధాన తీర్మానము ప్యాసయినట్లు తెలియుచున్నది.

"ఆంధ్రుల రాజకీయ, సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక అభ్యుదయమునకు, అభివృద్ధికిని సత్వర ఆంధ్రరాష్ట్రమత్యావశ్యకమగుట చేతనూ,

అట్టి ఆంధ్రరాష్ట్ర స్థాపనకావలయుననన్న ఆశయము గత పాతికయేండ్లకు పైగా ఆంధ్రదేశ మెల్లయెడలను, అనేకసార్లు ప్రకటితమగుటవలననూ,

లోగడ చెన్నపురి శాసనసభలలో ఉభయవర్గములవారును, కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారి అనుమతిని, కాంగ్రెసు వర్కింగ్ కమిటీవారియొక్క అనుమతిని పొంది, సత్వర ఆంధ్రరాష్ట్ర స్థాపనను గూర్చి తీర్మానించి యుండుటచేతను,

ప్రభుత్వమువారు వెంటనే ఆంధ్రరాష్ట్ర స్థాపన గావించవలయునని ఈ మహాసభవారు తీర్మానించుచున్నారు.

తమ ప్రయత్నములు సఫలముకానియెడల, ప్రజాప్రతినిధులే తమ ఆశయ సాఫల్యముకొరకు వలయు సకల త్యాగములను చేయవలయునని ఈ సభవారు తీర్మానించుచున్నారు"

మదరాసులో ఈ నెలాఖరువారములోనే ఆంధ్రనాటకకళాపరిషత్తు సమావేశము ప్రదర్శనములు మొదలగునవి పెద్దఎత్తున ఏర్పాటు చేయబడుచున్నవి.

అన్నిటికంటె ముఖ్యముగ, ఆంధ్రుల ప్రధాన సంస్థ యనదగు చెన్నపురి ఆంధ్ర మహాసభ రజతోత్సవ కార్యక్రమము మదరాసు నగరములో డిసెంబరు 21-వ తేదీనుండి జనవరి 4-వ తేదీవరకు ఒక పక్షము దినముల బహుళ కార్యక్రమముతో విశేష సంరంభముతో జరిపే ఏర్పాటులు చురుకుగా సాగుచున్నవి.

ఈ మధ్యనే కారాగారమునుండి విముక్తినంది ఆంధ్రులందరకు సంతోషము గొలిపిన స్పీకరు శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతక్రిందను, శ్రీమతి దుర్గాబాయమ్మ ఎమ్. ఎ., బి. యల్. గారి కార్యదర్శిత్వముక్రిందను, తగు సహాయవర్గముతో నీ రజతోత్సవములు ఆంధ్ర విజ్ఞాన కళా వైభవముల ప్రదర్శనమునకు మిక్కిలి తోడ్పడగలవు.

యావదాంధ్రజాతియందును ఐకమత్యము, సంఘనిర్మాణము, కార్యదీక్ష, సత్వర ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును చేకూర్చుటకు తోడ్పడు ప్రణాళికా నిర్ణయము, అందుగూర్చిన నిరంతరకృషికి వలయు పట్టుదల, శ్రద్ధతోను తత్పరతతోను కూడిన ఉద్యమమును, ఈ వివిధ సభలయొక్కయు ఉత్సవాదులయొక్కయు పర్యవసానము ఫలితము నైనయెడల ఎంతయు సంతృప్తి సంతోషములు కలుగగలవు. అట్టితరి, యీ సంరంభమునకు కారకులయినవారెల్లరును, ఉత్సవ సభాదికము లన్నింటను పాల్గొనినవా రందరును అభివందనీయులు చిరస్మరణీయులే యగుదురు.

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.

